# య శో గా న ము



## వేంకటేశ్వర వేంకటరమణ కవులు

### 1

శ్రీ కళ్యాణ గుణాలయంబయిన నీ చిత్తంబున న్నిల్పి, మా
యీ కావ్యేందిర తాసుహాసినిగ హాయిఁగూర్చు తన్నీదు సు
శ్లోక ప్రాకట జన్మభూమి యన నేర్చుఁ సత్యనారాయణా
ఖ్యాకా! తావక నిత్యనూతన యశోగానంబు కావించుచుఁ.

### 2

అహమికతో కవీంద్ర తనయల్ నినుజేరగ శ్రీ సుహాసినీ
మహాలున కేగుదెంచి, యటమామక కావ్యసుతాగ్రపీఠ స
న్నహన భవత్సుతాధిక ఘనప్రణయంబును గాంచి, దాస్య మ
న్వహ మొనరించియేఁ ప్రణయమందగ నూహయొనర్తు రెంతయుఁ.

### 3

సుకవీంద్ర కైతేంద్ర నికర సరస్వతీ
వాహినీ స్నానముల్ వలచి వలచి,
కవితా సతీమనోధవుడవై కృతులంది
కవిపాదుషా యన గణుతికెక్కి,
సామాన్య దశనుండి సత్కృషి కావించి
కడకు 'లకారముఁ' గడనజేసి,
స్వాతంత్ర్య సముపార్జనా తత్పరతజేసి
కృష్ణ జన్మస్థానమేగి యేగి

వేల ప్రేక్షకులున్న వేవేల సభల
రాజకీయార్థికములు, సారస్వత ముఖ
బహుళ విషయిక వక్తృతల్ వరగజేయు
సత్యనారాయణు ప్రశంస సలుపదరమె?

# యశోగానము



## వేంకటేశ్వర వేంకటరమణ కవులు

### 1

శ్రీ కళ్యాణ గుణాలయంబయిన నీ చిత్తంబున న్నిల్పి, మా
యీ కావ్యేందిర తానుహాసినిగ హాయిఁగూర్చు తన్నీదు సు
శ్లోక ప్రాకట జన్మభూమి యన నేర్చుఁ సత్యనారాయణా
ఖ్యాకా! తావక నిత్యనూతన యశోగానంబు కావించుచుఁ.

### 2

అహమికతో కవీంద్ర తనయల్ నినుజేరగ శ్రీ సుహాసినీ
మహాలున కేగుదెంచి, యటమామక కావ్యసుతాగ్రపీఠ స
న్నహన భవత్సుతాధిక ఘనప్రణయంబును గాంచి, దాస్య ము
న్నహ మొనరించియేఁ ప్రణయమందగ నూహాయొనర్తు రెంతయుఁ.

### 3

సుకవీంద్ర శైలేంద్ర నితర సరస్వతీ
వాహినీ స్నానముల్ వలచి వలచి,

కవితా సతీమనోధవుడవై కృతులంది
కవిపాదుషా యన గణుతికెక్కి,

సామాన్య దశనుండి సత్కృషి కావించి
కడకు 'లక్షాధికారముఁ' గడసజేసి,

స్వాతంత్ర్య సముపార్జనా తత్పరతజేసి
కృష్ణ జన్మస్థానమేగి యేగి

వేల ప్రేక్షకులున్న వేవేల సభల
రాజకీయార్థికములు, సారస్వత ముఖ
బహుళ విషయిక వక్తృతల్ పరగజేయు
సత్యనారాయణు ప్రశంస సలుపదరమె?

## 4

కవితలనల్లు టొక్కటియె కాదితరుల్ రచియించు కావ్యముల్
వివిధ వినూత్న రీతులను వేఁబరిశీలన సేసిసేసి, స
న్స్రప నవభావముల్ గల మనఃపరితోష పదంబులుంచి, యిం
పవునటు జేయు నీమతికి నంజలి! కొప్పరపూరి సత్యమా!

## 5

జిష్ణుభూజమెక్కి, శివుని చెలువు పెక్కిరించి, వ
ర్ధిష్ణు తారకేశుకాంతి రేగజేసి చివ్వకున్
విష్ణుపదము నాశ్రయించి, విశ్వమాక్రమించె నీ
తృష్ణ దీరనట్టి కీర్తి దివ్యకాంత సత్యమా!

## 6

అనుకూలవతియు భార్యయు
వినయము, విద్యయునుగల్గు బిడ్డలు, మిగులన్
ధనము, గుణమ్మును గల
యనఘా! నీవారితోడ హాయిని గనుమా!

## 7

చేతికి నెమ్మలేని కృతిశేఖరుడై, కమనీయ సాహితీ
ద్యోతక కావ్యకర్తయయి, యుజ్జ్వల ధార్మిక సార్వభౌముడై
జేతృ కిరీటియై, సచివ సింహమనందగు వస్తుపాలు వి
ఖ్యాత చరిత్ర కూర్చితిమి; గైకొనుమయ్య! భవత్సుతాదృతిన్.

## 8

ఎండిన మ్రాకులన్ చివురులెత్తగ జేసెడి కావ్యకన్యకన్
మొండి శిఖండి బండలకు భోగినిగా నొనరించి తాప్పుడున్
తిండి భుజించుకంటె జగతిన్ సుకవుల్ నినువంటి వెన్న పా
త్రుండు లభింప పెంపుడిడ దోసముకల్గునె లేశ మేనియున్.

## 9

కొప్పురాపూరి కులకీర్తి కప్పురంబు
ఘుమ ఘుమలు కృష్ణవేణి జోకొట్టుచుండ
తెలుగు తల్లికి వింతవింతలగు మేని
పూతలై వాసితము చేయుగాత జగతి!



# శుభాకాంక్ష

చిరంజీవులు వేంకటేశ్వర వేంకటరమణ కవుల నాశీర్వదించి వ్రాయులేఖ:—

మీరు పంపిన "వస్తుపాలుఁడు" అను గ్రంథమును చదివితిమి. గ్రంథ నిర్మాతలై సాహిత్య సేవను బూనుకొనుటయేగాక ఆధునిక సాహిత్యసతీమ తల్లికి యే చరిత్రచర్వణ గాథనో సమర్పించుటకంటె చరిత్రాత్మకమైన వైశ్యవీరుని ఆంధ్ర లోకమునకు పరిచయము గావించుట ప్రశంసనీయము. ఉన్నత పాఠశాల లందీ గ్రంథ ముపపాఠ్య గ్రంథముగా (నాండిటైల్) నియమింతురని ఆశించుచున్నాము. సాహిత్యసేవ గావించి వైశ్య యువకవులలో వన్నె కెక్కెదరని మా విశ్వాసము.

ఇట్లు

గజ్జలకొండ
4—1—58

'ఆంధ్ర విద్యావాచస్పతి', 'అభినవ బాణకవి',
'ఆశుకవి చక్రవర్తి', 'కవిసార్వభౌమ', 'కావ్యవిశారద',
సాహిత్య రత్నాకర', 'విద్యాభూషణ',
గౌరావఝుల రామకృష్ణసీతారామసోదరకవులు
"శతావధానులు"

# పరిచయము

శ్లో॥ విద్యా సముద్రాః వివిధాగమ జ్ఞాః
క్షాత్రక్రియా నిర్వహణ ప్రశస్తాః
వాణిజ్య దక్షార్థ సమృద్ధి సిద్ధాః
లోకానందా వైశ్యబుధా జయన్తు॥

లోకము సర్వరంగములలో ప్రగతి శీలముతో పురోగమించు నీ కాలమున సర్వసంఘములు తమ పూర్వప్రశస్తిని గూర్చి పరిశోధనలు కావించుకొనుచు ముందడుగున్నైచి ప్రాంత క్రొత్తల మేలికలయికతో భవిష్యత్తును పూలబాట గావించుకొనుచున్నారు. ప్రాచీనార్వాచీనుల ప్రశస్తిని పరిశీలించిన ఆత్మవిశ్వాసముతో నన్యులుత్తమ లక్ష్యముల సాధింపబూనుటెంతేని ప్రశంశనీయము. ఇట్టి పవిత్రకృషి జాతిచ్చైతన్యమునకు ఉత్తమాదర్శ సాధనకు సాక్షీభూతము. ఆ చైతన్యమే మానవునకు తాత్త్వక జ్యోతిని దర్శింపజేసి దేవతనుగావించుచున్నది. ఆ పవిత్రకృషిలో అనుగుజారినను, ఆదమరచినను అధః పతనమే శరణ్యము. ఈ అసిధారావ్రతము ఆర్యులకు ఆరాధ్యము.

సృష్టి ప్రారంభమునుండి నేటివరకు వాణిజ్యముచే అన్నదాతలై పట్టణములకు ప్రాణసమానులై, వైదిక లౌకిక విద్యలలో పట్టాభిషిక్తులై, దేవతలలో దేవతలై, గ్రహములలో ముఖ్యులై, వైదిక మంత్రనిర్ణేతలై, ఆర్షదర్శనులై, మహాకవి శిరోమణులై, మంత్రి శేఖరులై, దండనాథులై,

రాజాధిరాజులై, సామ్రాజ్యభార ధౌరేయులై, సర్వమత సమ్మత దర్శనులై, దాతృవతంసులై, విమర్శకులై, వైదుషీ పరిశోభితులై, రాజకీయ చతురులై, పత్రికా సంపాదకులై, సంస్కర్తలై, సకలరంగ సవ్యసాచులై, వైశ్యులు కీర్తి ప్రతిష్ఠల నార్జించుకొని యున్నను నేడు అనైక్యతతో నిద్రాణ స్థితిలో నున్నారు.

మనము మనపూర్వుల వారసుల మనిపించుకొనుటకు చేయదగిన మహాత్కార్యముల నిర్వర్తించి భవిష్యత్తును బంగారు పంటలు పండించుకొనుటకు, ప్రబోధ శంఖారావములతో మేల్కొల్పు జేతులు కలిపి ముందుకు దుముకుటకు నాందీపలికి సూత్రధార ప్రవేశము కావించినదీ భారతీయ వైశ్య చారిత్రక పరిశోధన సమితి.

సమితి పక్షమున కొన్నాళ్లకు ముందు పత్రికాముఖమున మేమొనర్చిన విజ్ఞప్తికి ఎట్టి సహకారము లభించియుండ లేదు. వైశ్యజాతిలో సకల రంగములలో ప్రముఖస్థాన మలంకరించిన మహనీయుల చరిత్రలు లోకమున కందజేయుట మా లక్ష్యము. ఏ తత్సాధనలో మాకు స్థూలముగనైన వివరములు తెల్పిగాని సలహాలిచ్చిగాని సాయపడుట కెవరును ముందుకు రాలేదు. మా స్వయం కృషితో మేము దేశపర్యటన గావించి సేకరించిన కొందఱు మహనీయుల చరిత్రల వ్రాసి ముద్రణ కొసగి యుంటిమి.

అందు ప్రథమముగ మూడువందల కోట్లరూప్యములు దానముచేసి ఉత్తమ సాంప్రదాయముల నెలకొల్పిన మహామంత్రి వస్తుపాలుని చరిత్రను గుజరాతీ, హిందీ, సంస్కృత

భాషా గ్రంథముల యాధారమున అతిశ్రమ జేసి బహుగ్రంథ పరిశోధనగావించి అత్యల్ప కాలములో తొలిప్రచురణముగా సమితి కందించిన శ్రీ వేంకటేశ్వర వేంకటరమణ కవులకు (భారతీయవైశ్య చారిత్రక పరిశోధన సమితి ఉపాధ్యక్షులు శ్రీ "ఆశుకవి" పెరుమాళ్ళ వేంకటేశ్వరగుప్త విజయవాడ, హైందవోన్నత పాఠశాల ప్రధానాంధ్రోపాధ్యాయులు సమితి ప్రధాన కార్యదర్శి విద్వాన్ శ్రీ వనమా వేంకటరమణగుప్త సత్తెనపల్లి) సమితి తరఫున నా అభివందనము లందజేయు చున్నాను. శ్రీవారలు సమగ్ర "భారతీయవైశ్య చరిత్ర"ను గూడా నచిరకాలములోనే పూర్తిచేయగలరని విశ్వసించు చున్నాను.

"భారతీయవైశ్య చరిత్ర" ను ప్రాచీనాధునిక భాగములుగ కనీసం ఐదువేల పుటలలో బ్రచురించు మహాదాశయము గలదు గాన ఓ మహనీయులారా! సుప్రసిద్ధులగు వైశ్యుల చరిత్రలను తమకు తెలిసినంతవరకు మా కందజేసిన చో మేము విపులకృషి కావించి యథాశక్తి కార్యభారమును పూర్తిచేసి "భారతీయవైశ్య చరిత్ర" ను ప్రచురింపగలమని మనవిచేయుచున్నాము.

ఇట్లు

20—12—57 | కవిపాదుషా కొప్పురావూరి సత్యనారాయణ
విజయవాడ | అధ్యక్షుడు.
భారతీయ వైశ్య చారిత్రక పరిశోధన సమితి
9/360, రంగనవారి వీధి
కొత్తపేట, విజయవాడ-1

# వస్తుపాలుడు

గంటంబు క త్తియు జంటగా నడిపిన
సాహిత్య రణ వీర చక్రవర్తి
శక్తి యుక్తుల రాజ్య చక్రంబు ద్రిప్పి ప్ర
సిద్ధికెక్కిన మంత్రి శేఖరుండు
ధృతకుర్చాల సరస్వతీ బిరుదుడు కవి
రాజు సత్కవి మనోరాజ హంస
కనకధారా వర్షమున నర్థిగణమును
దనిపిన సూత్న రాధాసుతుండు
అఖిల గుజరాతునన్ ఆబు నందుగూడ
హిందు ముస్లిము జైనుల మందిరము లు
దారబుద్ధి నిర్మించిన త్యాగమూర్తి
వస్తుపాలుడు సన్మంత్రి వల్లభుండు ॥

రచయితలు :
శ్రీ వేంకటేశ్వర వేంకటరమణ కవులు

# కృతజ్ఞత



దైవ కటాక్షమువలన మేము హిందీ, గుజరాతు, సంస్కృతాంగ్ల ప్రాచీన గ్రంథములు పరిశోధించి 'వస్తు పాలుడు' గ్రంథమును రచించి సహృదయుల కరసీమల కందింప గలుగుటకు నానందించుచున్నాము.

ఈ రచనాసందర్భమున ప్రాచీన జైనచారిత్రక విషయము లందు మాకుగలుగు సందేహముల నెప్పటి కప్పుడు తీర్చుచు తమ అమూల్యమైన సలహాలొసగి మమ్మాదరించిన శ్రీ ముని నందన విజయజీ (విజయవాడ వేంచేసిన సందర్భమున) గారికి, మేము అహమ్మదాబాదు వెళ్లిన సందర్భమున పాట ణాది జైన గ్రంథాలయములకు, ప్రముఖ సంస్థలకు పరిచయ లేఖలొసగి వలయు సలహా లొసగియుండిన శ్రీ ముని పుణ్య విజయజీ (అహమ్మదాబాదు) గారికి, వలయు గ్రంథములు మేమడుగుటయే తడవుగ నందిచ్చి గ్రంథ సాహాయ్యమును గావించిన మహావీరజైన గ్రంథాలయము (విజయవాడ) మేనేజరు బ్రహ్మశ్రీ బి.యస్. కృష్ణమూర్తి (హిందీ ప్రచా రక్) గారికి నత్యంత కృతజ్ఞతాభివందనము లర్పించుకొను చున్నాము.

అల్వారు (రాజస్థాన్) లో 30-11-57 నందు భారతీయ వైశ్య చారిత్రక పరిశోధన సమితి, భారతీయవైశ్య చరిత్ర నిర్మాణములగూర్చి మేము గనిన సుఖస్వప్నములకు చక్కని పునాదు లేర్పరచి యాథార్థ్యమును కావించి 'వస్తుపాలుడు'

గ్రంథ ముద్రణా వ్యయమును భరించుటేగాక మా రచింపబోవు 'భారతీయ వైశ్యచరిత్ర ప్రాచీనభాగ' ముద్రణా వ్యయము భరింతుమని వాగ్దానమొనరించి మమ్మనేక రీతుల ప్రోత్సహించుచున్న 'మా సారధి, మా సచివుడు, కవి పాదుషా' కొప్పురావూరి సత్యనారాయణగారికి సహృదయపూర్వక కృతజ్ఞతాభినందనముల నందజేయుచున్నాము.

మా 'భారతీయ వైశ్య' చారిత్రక వ్యాసములను తమ 'గుప్త' పత్రికలో ప్రచురించుచు ముఖ్యచిత్రములకు చక్కని బ్లాకులు తయారుచేయించి ముఖపత్రములందు ముద్రించుచు వ్యయప్రయాసల కోర్చి మాతో సహకరించుచున్న గుప్త పత్రిక సంపాదకులు మిత్రులగు కె. సి. గుప్తగారి కెంతయు కృతజ్ఞులము.

మా రెండవ రచన 'భామాసా' నాటకము. ఇది ఏడంకములుగల చారిత్రాత్మకరచన. మహారాణాప్రతాపునకు మంత్రియై యాపత్కాలమందు సంపత్తి దానమొనరించి దాతృశిరోమణి జీవిత చిత్రణము. వరుసగ 'విమల మంత్రి' కలికాల సర్వజ్ఞ, ఆచార్య హేమచంద్రసూరి, ప్రభృతుల జీవిత చరిత్రలను రచించి ప్రచురింపగలమని మనవిచేసుకొనుచున్నాము.

రాష్ట్రేతర వైశ్యప్రముఖుల చరిత్రలు పలువురు మిత్రులు మా కందించుచున్నారు. కాని—ఆంధ్రప్రదేశమునకు చారిత్రకవిషయములు మాకు తెలిసినంతయే తప్ప నధికముగ తెల్పు సహృదయుల సహకారము బడయలేకున్నాము.

కవిపండిత చారిత్ర కవతంసులు సహృదయముతో తాము సేకరించిన వైశ్యప్రముఖుల చారిత్రక విశేషముల మా కందజేసి మాయీ మహోద్యమమున కండదండలుగ నుండి త్వరలో బృహద్గ్రంథమగు భారతీయవైశ్య చరిత్ర నిర్మాణమునకు సహాకరింప ప్రార్థన.

విద్వద్విధేయులు
**వేంకటేశ్వర వేంకటరమణ కవులు**

ఓం

౧

చతుర్ముఖ ముఖాంభోజ । రాజహంసీ సరస్వతీ
శ్రీమాన్సరస్వతీ దేవి । భవతాప సరస్వతీ.

సత్కృత్య వృక్షములకు క్షేత్రమువంటిదగు శ్రీ భారత క్షేత్రమున సరస్వతీలక్ష్మీజన్మగృహము, శ్రీపతి సంశోభితమగు గుర్జరదేశము సర్వసమృద్ధమై యున్నది. అందలి ప్రత్యంగుళభూమియు, పుణ్యక్షేత్రమువంటి మహిమను కలిగియున్నది. ఆ దేశమందలి ప్రతి గ్రామము దేవాలయములతో, వనములతో, పూలతోటలతో మనోజ్ఞమై నందనవన సంపదను ధిక్కరించుచున్నది. ఆ గ్రామములలో నతిలోక వైభవముగల యణహిల్ల పట్టణ మగ్రగణ్యము. అందలి ప్రజలు పరులను ప్రార్థించి యెఱుగరు. యాచకుల కోరికల నిరాకరించి మసలరు. ఆ పౌరులు నయ, వినయ, వివేక, దాన, ధనము లమరి విశ్వావిశ్వ విభూషణులై యున్నారు. అందు రసాలంకరణాలవాలమగు ప్రాగ్వాట వంశమను వైశ్యవంశము శోభించుచుండెను. ఆవంశఖనియం దుదయించిన పురుషరత్నములు అద్భుతాద్భుత కాంతి వంతులై పండితులు సరస్వతినివలె లోకము నలంకరించిరి. వారిలో చౌళుక్యరాజ్య భారధౌరేయుడు, కీర్తిలతామంటప భూముడగు చండప మంత్రీశ్వరుడుకలడు. శుభములకు ముఖ్యా

నుగ్రహుడగు నా మంత్రి చాణక్యుని చాతుర్యమును, బృహస్పతి వాగ్వైచిత్ర్యమును, సముద్రుని గాంభీర్యమును పుణికి పుచ్చుకొన్నాఁ డన్నట్లుండెను. అతని తనయుడు చండప్రసాదుడు. అతఁడు రాజకార్యప్రవణుఁడై అనంతమహిమా రత్నాకరుఁడై ప్రపంచ ప్రసిద్ధినొందెను. చండప్రసాద సముద్రునకు సోమునివంటి సోముఁడుదయించెను. అతఁడు చంద్రునివలె తోఁబుట్టినదాని యిండ్లకు తామరలకు పీడాకరుఁడు కాక, కళంకములేక గుణరత్నకోశమై సిద్ధరాజు రత్నకోశాధికారి యాయెను. ఆ సోముని తనూజుఁడశ్వరాజు. అతఁడు ఇంద్రసదృశుఁడు. ధర్మధౌరంధర్యముతోఁబాటు చౌళుక్యరాజ్య భారధౌరంధర్యము వహించెను. ఆతఁడేనిక కొదమవలె నున్నత వంశోత్పన్నుఁడై దానధారార్ద్రహస్తుఁడై శోభించెను.

చౌళుక్య సేనాధీశ్వరుఁడు. తన సద్గుణములచే సుజనులకు తృప్తికలిగించు ఆభూశ్రేష్ఠి శంకరునివలె శక్తివంతుఁడై శత్రురాజుల సంహరించి త్యాగలీలాపరాజిత కామధేను, కల్పవృక్ష, చింతామణి ప్రముఖుఁడై ప్రకాశించుచుండెను. ఆతని భార్య లక్ష్మి. ఆమె యొనరించు సత్పాత్రదానములకు హర్షించిన లక్ష్మీదేవి యొకప్పుడును వారియిల్లువదలి కదలకుండెను. ఆ దంపతులకు కుమారదేవియను తనయారత్నము కలదు. ఆమె లావణ్య వినయనయ దానధర్మములు జగత్ప్రసిద్ధములు. ఆమె గంగవంటి పవిత్రురాలు.

అశ్వరాజునకు భూతభవిష్యద్వస్తు విజ్ఞానవేత్తలగు హరిభద్రాది పండితులు గురువులు. వారొకనాఁడొకచో జేరి

ధర్మగ్లానికిజింతిల్లుచు ధర్మప్రవర్తకులగు కుమారపాల, ప్రభావక, వాగ్భట, అమ్రభటాదుల ఘనకృత్యముల స్మరించుచు నిద్రింప వారి యిష్టదేవత ప్రత్యక్షమై స్వప్నమందిట్లు నుడివెను. "నాయనలారా! మీరు ధర్మగ్లానికి వగవవలదు. అచిరకాలమున వస్తుపాల తేజఃపాలు రుదయించి ధర్మోద్ధరణ మొనరింతురు. సామంతసింహుని తనయుడు శాంతి. అతనికి బ్రహ్మనాగుడను కొడుకు. వానికి ఆమదత్తుడు సుతుడు. నాగడు డాతని కొడుకు. ఆ నాగడునకు ప్రసిద్ధ దండనాయకుడు నఖండవిక్రముడగు ఆభూ శ్రేష్ఠి కుమారుడు. ఆభూశ్రేష్ఠికి కుమార దేవియను తనయగలదు. ఆమె పతివ్రతా శిరోమణి. పద్మిని. పద్మసురభిళాంగి, హరిణీలోచన. హంసీగమన. పికీభాషిణి. సదాచారమున రోహిణి. సంపదలో లక్ష్మి ఆమె గర్భమున వస్తుపాల తేజఃపాలు రుదయింతురు. మీరు నా యాజ్ఞగా నశ్వరాజునకు ఆభూశ్రేష్ఠి కీవిషయము తెల్పి కుమార దేవి నశ్వరాజున కిచ్చి వివాహము కావింపజేయు"డని చెప్పి మాయమాయెను.

పిదప గురువుల ప్రోత్సాహమువలన నశ్వరాజు కుమారదేవిని పెండ్లాడి తనవారితో సుంహాళకపురముచేరి నివసించుచుండెను. కుమారదేవి పితృమాతృ భర్తృవంశములను గంగ ముల్లోకములనువలె పవిత్రీకరించెను. కామకల్పలతయు, సర్వాంగ గుణసంపన్నయునగు కుమార దేవితో నశ్వరాజు సుఖించుచు చతుర్విధ పురుషార్థముల బోలిన వారగు నలుపురు తనయుల నెత్తెను. తొలివాడు లూణిగుడు.

మరివాడు మల్లదేవుడు. అతడు ప్రసిద్ధవంశీయుడు. ఆ పురుష రత్నమువలన భూమి రత్నగర్భయాయెను. ఈతని హృదయమున భగవంతుడు, భగవంతుని హృదయమున కౌస్తుభమున్నందున నితడు కౌస్తుభమునవలె ప్రశస్తిపాత్రుండాయెను.

మూడవవాడు వస్తుపాలుడు. ఇతడు విష్ణువువలె బలిబంధనమాచరించెను. అతని గొప్పతనమాతని వదనాంబుజ సత్యానపాయినియగు శారదయే యెఱుగును. ఆ మంత్రి చంద్రునకు చంద్రునితో సామ్యమునకై వెదుక నేల? చంద్రుడు సుధనొసగును. మంత్రి వసుధనొసగును. అతని గుణసంపదలతో నిండిన కీర్తిని ధరాదేవి వసనముగ ధరించెను.

ఇక నాలవవాడు తేజఃపాలుడు. అతడు రాజ్యభారధూర్వహుడు. రూపొందిన పుణ్యమై ప్రజానయన కుముద కుముదాకరుడాయెను. ఆతడు విష్ణువువలె జగత్త్రయీసూత్రమును తన కుక్షికందరమందుంచుకొనెను. వీరు నలువురు పదునాల్గు లోకములందు ప్రసిద్ధులైరి. న్యాయము, ధర్మ, కళా, విద్యా, భాగ్య, సౌభాగ్య తేజోవంతులై ప్రియతీర్థులైరి.

వస్తుపాలునకు లోకాద్భుత సౌందర్యయు, మదన కామధేనువనదగిన లలితాదేవి భార్య. అర్థికల్పలతయు, రంభాస్తంభనకారి రూపసంపన్నయగు సౌఖ్యలత రెండవ భార్య. తేజఃపాలుని భార్య అనుపమాదేవి. అనుపమ అనుపమప్రజ్ఞలో అనుపమ. దేవగురూపాసకురాలు. ఆమె మంత్రీశ్వరుల గృహమందు సరస్వతివలె మాన్యురాలై

సద్విచార గృహాచార ధర్మాధార క్రియాదుల నడిపించు చుండెను.

ముదిసి మదిదప్పిన బృహస్పతికి తోడ్పడుటకో యనన్నట్లు అశ్వరాజు స్వర్గముచేరెను. సుకృతములకు తల్లియగు తన తల్లితో, బంధువులతో గూడి వస్తుపాలుడు సుంహాళక గ్రామము వదలి పితృవియోగశోక మీడుటకో యనన్నట్లు మండలీనగర మున నివసింపసాగెను. బాల్యముననే లూణిగ, మల్ల దేవులు పరలోకము చేరినందున, నశ్వరాజు మరణమువలన నా కుటుంబము మిగుల శోకజడమైయున్నను ప్రతిభానంతుడు స్ఫురత్కాంతులు తాపవర్జితులగు వస్తుపాల తేజఃపాలుదు సత్కృత్యము లాచరించి మిక్కిలి ప్రసిద్ధినొందిరి.

సహజముగ తండ్రికన్న తల్లి గౌరవమున నధికురాలని తలచినవస్తుపాలుడు తల్లినిపూజించుచుండ తనయుడొనరించు భక్తికి కుమారదేవి సంతసించుచు ననేక పుణ్యకార్యముల గావించుచు భర్తృవియోగము భరింపజాలకనో యనన్నట్లు భర్తృసాన్నిధ్యము చేరబోయెను. మాతృవియోగ దుఃఖితు లగు నా సోదరులను గురువులరుదెంచి యోదార్చి ధర్మో దేశనము కావించిరి. వస్తుపాలుడు విచారమువదలి తన భవిష్యత్తును ప్రశ్నింపవారు "నీవు తీర్థయాత్రలు కావించుచు ధవళక్కపురమును జేరినచో నచ్చట నీకు మహాభ్యుద యము కలుగు"నని సెలవిచ్చిరి. వారు గురువుల సాగనంపిరి.

పిదప వస్తుపాలుడు నిత్యోదయ ప్రజ్ఞాతేజముచే సూర్యునిమించిన తేజఃపాలుని సమ్మతినొంది గృహాసర్వ

స్వాము గైకొని సిద్ధిసూచకములగు శకునములకు సంతసించుచు కుటుంబసమేతముగ తీర్థయాత్రలకు బయలుదేరెను. వారు హడాలక గ్రామముచేరి ధనావసరము గమనించి యొక లక్ష ధనముగైకొనిపోయి యొకచో త్రవ్వి నిధినార్జించిరి.

ఆ సోదరులా నిధి నింటికిదెచ్చుకొని యుదారబుద్ధి ప్రదాయినియు సరస్వతివంటి మాన్యురాలగు ననుపమాదేవిని జూచి "దేవీ! మేము నిధానమును దెచ్చితిమి. ఇది సువర్ణ సంయుతము. దీని నేమిచేయవలయునో తెల్పు"మనిరి. ఆమె సుధామాధుర్యమును జయించు వారివచనము లాకర్ణించి లజ్జానమ్రముఖియై యిట్లనెను. "లోకగోచరమగు పదవిగోరు వారు శత్రుంజయోజ్జయంతాది పుణ్యతీర్థములకు యాత్రలు గావింపవలయును. న్యాయార్జితవిత్తమున నొకమారు యాత్ర గావించినను వేయికోట్ల జన్మల పాపములు నశించును".

ఆ సోదరులు మధురములు, హితములునగు నామె వాక్యములాకర్ణించి సంతోషించి యా ధనమంతయును సత్కృత్యములకు యాత్రలకు వ్యయించిరి. గ్రామ గ్రామము లందు సత్కార్యము లొనర్చుచు వారు శ్రీ వీరధవళుని రాజధాని యగు ధవళక్కపురమును జేరిరి.

శ్రీ కపర్దిసురాదేశమువలన సోదరులచ్చట చిర కాలము నివసింపగా వారికి జౌళుక్య రాజగురువగు సోమేశ్వరునితో బరిచయము కలిగెను. వారి స్నేహము క్షీరనీర సదృశమై ప్రకాశించెను.

ఒకనాడు శయ్యాయందు సుఖనిద్ర గావించుచున్న వీరధవళున కిష్టదేవత స్వప్నమందు సాక్షాత్కరించి భూత భవద్భవిష్యత్తుల నెరిగించి వస్తుపాల తేజఃపాల సోదరుల మంత్రుల గావించుకొన వలసినదని తెల్పి మాయమాయెను.

వీరధవళుడు నిద్రాముద్ర వదలి దేవ్యుపదేశమును స్మరించి "నేత్రములేని ముఖము, స్తంభములేని యిల్లు, వేద శూన్యులగు విప్రులు, శీలహీనులగు ఋషులు, మంత్రిహీను లగు రాజులు నిష్ప్రయోజకులు. రాజులార్జించిన సంపదలను మంత్రులు సద్వినియోగ మొనరింతురు. సముద్రమార్జించిన రత్నములను సరసులు సానబెట్టుదురు. మంచి భార్యయు పుత్రుడు గృహమునకౌన్నత్యము కల్గించునట్లు సన్మంత్రి రాజ్యమున ప్రాజ్యకార్యములను గావించు"నని చింతించి వందిమాగధుల స్తుతిపాఠములు విని శయనమువదలి కాల కృత్యములు కావించి దేవతార్చన మొనరించి దానధర్మము లాచరించి తండ్రికడకేగి తన స్వప్నవృత్తాంతమును దెల్ప నతడభినందించెను. తండ్రికొడుకు లానందించుచుండిరి.

ఇంతలో సోమేశ్వరు డరుదెంచి తండ్రికొడుకులకు మంగళాశాసనము కావించెను. వారు గురువును బూజించి స్వప్నవృత్తాంతమును దెల్పిరి. గురువానందించి మీకు కుల దేవత ప్రసన్నమగుట మీరొనరించు ధర్మమహాత్మ్యమే! మీరు వస్తుపాల తేజఃపాలురను మంత్రులుగా నియమించు కొనుడు. న్యాయనిష్ఠుడు, గుణజ్యేష్ఠుడు, బుద్ధివిశిష్టుడగు మంత్రి రాజుపుణ్యమున లభించును. మంచినీటినిత్రావి

యుప్పునీరుగ మార్చెడివానివలె దుష్టమంత్రి తనయందుంచిన కార్యభారమును నశింపజేయుచున్నాడు. మీ మూలపురుషు డగు వనరాజు సైతము మంత్రిసహాయము వలననే ఘూర్జ రైశ్వర్య సంపదల నార్జించియుండెను. మీకు దేవి వచించిన మంత్రిపుంగవు లిరువురు రాజవ్యాపారమునందు న్యాయ శాస్త్రమునందు పదునారు కళలయందు సర్వధర్మములందు సమర్థులగు మహాపురుషులై యున్నారు. వారు తీర్థయాత్రలు సేవించి రాజసేవార్థమిచటకి వచ్చి యితఃపూర్వము నన్ను కలిసికొనియుండిరి. మీరిచ్ఛగించుచో వారి నిచ్చటకి గొని వత్తుననెను.

పిదప సోమేశ్వరుడు వారి ఆజ్ఞనంది వినీతులగు వస్తుపాల తేజఃపాల సోదరుల నుచితరీతిని రాజసమ్ముఖము నకు గొనివచ్చెను. సోదర సహితుడగు వస్తుపాలుడమూల్య ములగు కానుకల సమర్పించెను. వీరధవళుడు వారి నుచితా సనముల గూర్చుండ నియమించి గౌరవపురస్సరముగా నిట్లు వచించెను. "మీ వదనగాంభీర్యము గుణసంపదను జాటు చున్నది. మీ వినయ మాభిజాత్యమును దెలుపుచున్నది. మీ వాక్ర్సవంతి శాస్త్రపాండితీపటిమ నుగ్గడించుచున్నది. న్యాయధర్మనిపుణులు సూర్యచంద్ర సదృశులు మహౌజసుల రగు మీరు మా పూర్వపుణ్యమువలన లభించితిరి. మావలన రాజ్యమునకు తొందరపాట్లు సంభవించినందున మిమ్ములను మంత్రుల గావింపనెంచితిని. నేటినుండి యీ రాజ్యము

చతురంగబలములు సకలసంపదలు మముల్లోకముల కుపకారము చేయగల మీ కరసమీపములందుంచు చుంటిని".

వస్తుపాల మహామంత్రీశ్వరుడు వీరధవళుని ఆనందామృతస్యందులగు వాక్యము లాకర్ణించి రాజుతో నిట్లనెను. "దేవా! పుణ్యవంతులలో అగ్రేసరుడగు సేవకుడు ప్రసన్న వదనముతో ఇంతటి మధురముగ సంభాషించిన తన రాజున కెట్లు కృతజ్ఞుడు కాకుండును? సత్పురుషులు రాజును సందర్శించి పాపముల బోగొట్టుకొందురు. రాజు ప్రసన్న వదనముతో సేవకుని పరికించునో వాడు శుచి, కులీనుడు, దక్షుడు, సుభగుడగు చున్నాడు. శుభప్రదములగు మూడు యుగము లంతరించి కలికాలము ప్రవర్తించుటచే రాజులకు సేవకులకు సంబంధము చెడినది. నృపభవనకోశాదులచే ప్రజావృద్ధి కావించి నానార్చనా పరిచయములచే దేవతలను గురువు లను సేవించి మేము మీవద్ద ననుపమ కార్యములాచరింపఁ గలము, నేము మండలీనగరమునుండి సకుటుంబముగ సకల సంపదలతో మిమ్ము సేవింపనరుదెంచితిమి".

రాజేశ్వరుడగు వీరధవళుడు వస్తుపాలుని వాక్యముల విని ప్రసాదామృత వర్షమును గురియజేయుచు "ఇదిమొదలు ఈ సర్వాంగ సంపూర్ణ సామ్రాజ్యమును మీకు స్వాధీన పరచుచున్నా"మని వచించి మంత్రుల చేతులకు రాజముద్రిక లందించెను. మంత్రిసోదరులు పాత్రదానములు గావించి రాజన్యసేవితులై గృహమును జేరి కలికాలమను మదపుటేనుగునకు సింహకిశోరములై ప్రకాశించుచుండిరి.

వస్తుపాలుఁడు సోదరసమేతుఁడై రాజ్యభారము వహించి పూజ్యులను పూజించుచు మాన్యులను గౌరవించుచు తన యానన్నత్యముచే రాజ్యవృద్ధులను మాటిమాటికి సంతస పరచుచు సోమేశ్వరగురుని మనోభీష్టార్పణాదులచే బ్రీతుని గావించుచు బహుమానములచే సకల ప్రజల నానందింప జేయుచు ధార్మిక సమూహమును వర్ధిల్లజేయుచు ప్రవీణులను గమనింపుచు దురాత్ములను మందలింపుచు రాజహంసవలె రాజుమనస్సున గ్రీడించుచు సుమిత్రానంద నర్ధనుడగు లక్ష్మణునితో కూడిన శ్రీరామునివలె తేజఃపాలునితోఁ గూడి సర్వతోముఖ ప్రసిద్ధినార్జించెను. వస్తుపాలుఁడు లంచముల దీసికొని సంపన్నులైన అధికారిని కొండెములు జెప్పిన నేర మునకై ఇరువదొకసూర్లద్రమ్మముల అపరాధమును విధించి దుశ్శిష్యుని గురువువలె వినీతుని గావించెను. ఆ ధనముచే మంచి భటులను అశ్వబలమును సంపాదించెను. అన్యాయ కారియగు గ్రామాధికారి సంపదను స్వాధీనపరచుకొని సైన్య వృద్ధి గావించెను.

వస్తుపాలుఁడిట్లు ధనబలముచే సైన్యబలమును పెంపొం దించి తేజఃపాలునకు రాజ్యభారమప్పగించి ఒకనాఁడు శ్రీ వీరధవళమహీపాలునితో నిట్లు విన్నవించెను. రాజులకు దుష్టశిక్షణ శిష్టరక్షణములు ధర్మము. లోకమున న్యాయము స్థాపించనిచో ధర్మము, నీతి అంతరించును. మనరాజ్యమందు

గ్రామాధికారులు పట్టణాధికారులు చిరకాలమునుండి రాజకీయ మపహరించియుండిరి. కావున మన మా ధనమును గ్రహింపవలయునని రాజును ప్రోత్సహించి దండయాత్రకు గొంపోయెను. వారు ప్రతిగ్రామమునకు ప్రతిపురమునకు పోవుచు సామదానాద్యుపాయములచే కార్యసాధనము గావించుచు నొకొక్కచో రాజున కధికద్రవ్య మీయవలయునను వ్యాజముచేతను, మరియొకచో తప్పులెత్తి చూపించియు, ఇంకొకచో ప్రాత తప్పుడులెక్కలను బట్టుకొనియు మదాంధచిత్తులను బంధించి అధికారమునుండి తొలగించి వారి ధనమును స్వాధీనపరచుకొనిరి.

వస్తుపాల మంత్రీశ్వరు డీవిధముగా ధనమార్జించి రాజుతో "మహారాజా! ద్రవ్యకోటి మదోద్ధతులు దుష్టచిత్తులునగు రాజులు తీర్థయాత్రికులను కొల్లగొట్టుచున్నారు. వీరిని శిక్షింపవలయునని ప్రోత్సహించి పశ్చిమ దిగ్విజయయాత్రకు బయలుదేరదీసెను. వర్ధమానరాజును గోహిలావలి రాజును సామంతుల గావించుకొని మహాధనము గ్రహించి సేనలను సేకరించి వామనస్థలిజేరి సరస్తటమున నివాస మేర్పరచుకొనెను. ఆ కాలమున వామనస్థలమును సాంగణ చాముండులను సోదరులు పాలించుచుండిరి. వారు వీరధవళుని పట్టమహిషియగు జయతలాదేవి సోదరులు. వస్తుపాలుడు రాజానుమతమున రాయబారిని సందేశ పురస్సరముగ బంపెను.

పిదప నా రాయబారి వామనస్థలముజేరి కొలువు కూటమునకేగి సాంగణ చాముండుల సందర్శించి తిరిగివచ్చి నిండుకొలువుననున్న వీరధవళ మహారాజుతో "వణిగ్బల మదోన్మత్తుడగు వీరధవళుడు నిరర్థకముగ ప్రలాపించు చున్నాడు. మంత్రుల ప్రోత్సాహముతో నెత్తివచ్చిన యాతడు మా కత్తికి తలయొగ్గక తప్ప"దని పల్కిన సాంగణ చాముండుల సందేశమును విన్నవించెను.

అనంతరము వీరధవళుని పట్టమహిషి జయతలాదేవి తనభర్త అనుమతితో తనసోదరుల కడకేగి బుద్ధి గరపెను. కాలము దీరినవారు హితమును పరిగ్రహింపనిరీతి వారామెను దూలనాడి యుద్ధరంగమున నీభర్తను వధించి నీకు భంగము నిత్తుమని ప్రేలిరి. సీతాదేవివంటి శీలవతియగు నామె తన భర్తప్రతాపము విస్తరముగ వర్ణించి తిరిగివచ్చి సారాంశ మును భర్తకు విన్నవించెను.

వీరధవళుడు కోపారుణలోచనుడై యుద్ధసన్నాహ ముల గావించెను, వస్తుపాలుడు సర్వసన్నాహములతో రాజు కడకు వచ్చెను. వీరధవళుడు సోమేశ్వర వస్తుపాలురతో రణ భూమి కరుదెంచెను. సాంగణ చాముండు లెదిరించిరి. దేవ దానవ మానవ భీకరముగ రెండువాగులవారికి పోరు భీకర మాయెను. ఉభయ సైన్యములందలి వీరులు రణాతిథులగు ప్రతివీరుల కెండ దగులకుండ బాణములతో మండపముల నిర్మించిరి. దైన్యమందిన సైన్యమును సాంగణ చాముండులు ప్రోత్సహించుకొని ఘూర్జరసైన్యముల గలతపరచిరి. వీర

ధవళుడు సాంగణునితో వస్తుపాలుడు చాముండునితో తల పడెను. యోధులు దేవతలకు సైత మాశ్చర్యానికితిగ కుంతాకుంతిగ ఖడ్గాఖడ్గిగ శరాశరిగ ముష్టాముష్టిగ పోరిరి. వీరధవళ వస్తుపాలురు రెప్పపాటు కాలములో సాంగణ చాముండుల నధించి విజయలక్ష్మిని గ్రహించిరి. వారు జయజయ ధ్వానములతో రాజమందిరమును ప్రవేశించి దశకోటి హేమము, మణిమాణిక్యములు, ఉచ్చైశ్శ్రవ సోదరములగు పదునాలుగునందల గుఱ్ఱములను పరిగ్రహించిరి.

వీరధవళుడు నెలదినము లందుండి పవిత్రతను సృజించుచు రాజ్యమునకు మృతులగు రాజులపుత్రుల నభిషిక్తుల కావించెను. అచ్చట వస్తుపాలుడు బంగారు కలశముచే ప్రకాశించు చైత్యమును నిర్మించి వీరజినేంద్ర ప్రతిమను స్థాపించెను. వీరధవళుడు మంత్రితోగూడి యచ్చట కనతి దూరముననున్న విశ్వవిఖ్యాతమును కోటిజన్మలపాపము తొలగించు గిరినార మహాతీర్థమునకు బోయి నేమినాథుని సందర్శించి దేవపూజార్థమై గ్రామదాన మొసంగిరి. దేవపట్టణము జేరి ప్రభాసతీర్థమున మహారాజు స్నానముగావించి యనేక దానములు కావించి సోమేశ్వరదేవుని లక్షసువర్ణములతో బూజించెను. నిరంకుశ రాజులగు మానగజేంద్రాదులనుగెల్చి తన కీయవలసిన కప్పములను గ్రహించెను. రాజు కుతూహలముతో ద్వీపపత్తనమందు కుమారపాల భూపాలుడు నిర్మించిన యున్నతచైత్యమును జూచి మంత్రిసమేతముగ విస్మ

యము నందెను. నాజాన్వయమును నుదయించిన తాలధ్వజ పురాధిపతులను రాజులు కానుకలొసగి స్తుతించిరి.

రాజిట్లు సర్వరాష్ట్రములందు సామ్రాజ్యాధిపత్యమొంది మంత్రిసమేతముగ ధ్వజశ్రేణి మనోభిరామమగు ధవళక్క నగరమును జేరెను. రాజునకు గురువులకు మ్రొక్కి వస్తుపాలుడింటికేగెను. వస్తుపాలుడు శుచిచిత్తముతో సహోదర్యుడై దేవాలయములందు బూజలు కావింపించి, యగ్హాతుల గౌరవించి చైత్యపూజలు కావించి పెక్కువేల సువర్ణముల వ్యయించెను.

ఒకనాడు వస్తుపాల సమేతుడగు రాజు భద్రేశ్వర వేలాకూలమండలి ప్రతీహారకులకాననాలంకారుడు, పరాక్రమ పరశురాముడగు భీమసింహ మహారాజును తనకు సామంతునిగ నుండవలసినదని లేదా యుద్ధాతిథివికమ్మని సందేశమంపెను. భీమసింహుడు కుపితుడై యా సందేశమును వీరధవళునకు దిరిగిపంపెను. భద్రేశ్వరుడగు భీమసింహుడు తన బలములతో సన్నద్ధుడాయెను. వీరధవళుడు దిక్పాలక సంకాశులగు రాజులతోకూడి సమరసన్నాహము లొనర్ప సాగెను.

మరుస్థలీఫాలస్థలీ తిలకసన్నిభమగు జావాలినగరమును సమరసింహు డేలుచుండెను. అతని కుదయసింహుడను తనయుడు కలడు. ఆతనికి మువ్వురు సోదరులు కలరు. తొలివాడు సామంతపాలుడు. మలివాడు అనంతపాలుడు. మూడవవాడు త్రిలోకసింహుడు. జ్యేష్ఠభ్రాతయగు నుదయసింహుని

వదలి స్వతంత్రులై శ్రీ వీరధవళు నాశ్రయించుటకు వస్తుపాలు నాశ్రయించిరి. వస్తుపాలుడు వారిని రాజదర్శనమునకు గొంపోయి విషయమెరిగించెను. రాజువారడిగిన ఐదులక్షల జీతము నీయదలపక వారిని సాగనంపెను. వస్తుపాలుడీ కార్పణ్యమును నిరసించినను రాజు లెక్కింపలేదు. ఆ సోదరులు వీరధవళునితో విరోధము పెట్టుకొన్న భీమసింహు నాశ్రయించిరి. ఆతడీ సదవకాశమును సార్థకపఱచుకొని వారు కోరినదానికన్న రెండింతలు జీతమిచ్చి తనయందు వారి భక్తిశ్రద్ధల నభివృద్ధి కావించుకొనెను. చంద్రుడు సంద్రమం దుదయించినను శివుని శిరమలంకరించినట్లు వీరధవళునివదలిన మారపసోదరు లున్నతినొందిరి.

భీమసింహుడు రాయబారిని వీరధవళునివద్దకు బంపి పంచగ్రామము యుద్ధక్షేత్రముగా నిర్ణయించుకొని సకల సన్నాహములతో నరుదెంచెను. వీరధవళుడు పట్టపు టేనుగ నెక్కి గజానీక, హయానీక, రథానీక పదాదులతో సామంత రాజులతో, సవ్యసాచి సదృశసచివ యుగళముతో, జయ సూచక శకునములతో సాగిపోయి పంచగ్రామము చేరెను. వస్తుపాలుడు గూఢచారుల మూలమున శత్రువృత్తాంతమును సాకల్యముగ నెఱిగి "మహారాజా! మీరు కార్పణ్యదోషమున, ధనలోభమున మారపసోదరుల దృణీకరించితిరి. వారు మన శత్రువుల జేరిరి. గోటబోవు భీమసింహు డీనాడు గొడ్డలికి నెదురుతిరుగు నంతవాడెమో"ననగా వీరధవళుడు "మహామంత్రీ! నా పొరపాటును మన్నించి నేను గెల్చునట్లు నీ

రాజనీతిని ప్రయోగింపు"మన రాజభక్తుడగు మంత్రీశ్వరుడు మౌనము పూనెను.

మరునా డుభయపక్షములు పోరు నారంభించెను. జేహాళుడు, వీరసోమవర్మ మొదలగు సామంతులు, వస్తుపాల తేజఃపాలురు భీమసింహుని సైన్యమును జెల్లాచెదరు చేయుచుండ వారిధాటికోహటించి మారవసోదరులు వీరధవళు నెలయించుకొని దూరము గొంపోయి యాతనిని గుఱ్ఱము మీదనుండి పడవైచి యాతని పట్టపుగుఱ్ఱమును గొంపోయిరి. సాయంకాలమాయెను. పోరు నిలిపిరి. ఆరాత్రి భీమసింహుని గుడారములలో వేడుకలు విందులు సాగిపోవుచుండెను. వీర ధవళు డోడినాడని సంపూర్ణముగ విశ్వసించిరి. వీరధవళుడు వస్తుపాల ప్రేరితుడై తాను నాడొందిన యవమానము లెక్క గొనక జూదములు, విందులు వినోదములతో ప్రొద్దుగడుపు చుండెను. ఈ విషయమును భీమసింహుడెరిగి వస్తుపాలు డేదో గంభీరమగు వ్యూహము పన్నినాడని తలచి, గుండెలు చెదరి తనవారితో యోచించి సంధిసందేశమును బంపగా వస్తుపాలుడు తన బిరుదములను భీమసింహుడు పరిత్యజించి యుద్ధాపరాధ మొసగునట్లు సంధినియమముల విధించి పోరుమాన్పించెను.

శ్రీ వీరధవళుడు కర్కరాపురిచేరి వస్తుపాలుని మాటలమీద కొన్నాళ్లుండెను. వస్తుపాల మహామంత్రి యచట శ్రీ మదాది జినేశ్వరాలయము నిర్మింపజేసెను. దోపిడిమూకల దండించెను. ఖత్తకమునందు తన రాజు

ప్రతిమనుస్థాపించెను. భీమపల్లియందు పార్శ్వప్రభువున కాలయ మేర్పరచెను. వీరధవళుడు రాణకేశ్వరమను పేర శివాలయము నేర్పరచెను. వస్తుపాల సచివుడు ఆదిత్యపాటకమున, ఝూంరండకమున శుద్ధధాతుబింబము లేర్పరచి యేడు లక్షలు వ్యయించి చైత్యముల నిర్మించెను. సూర్యపురమున సూర్యాలయము కట్టించెను. బ్రహ్మశాలలు, సత్రములు స్థాపించెను.

తేజఃపాలుడు రాజకార్యములఁ జూచుచుండ వస్తుపాలుడు సత్యపురమునకరిగి చంద్రప్రభ జైనదేవాలయము సందర్శించెను. అచ్చట శ్రీనాహాడ మహారాజు బంగారు బింబముతో చైత్యమేర్పరచి యుండెను. రత్నాచార్యులు ప్రతిష్ఠలు కావించియుండిరి. మంత్రి దానములొనరించి పది లక్షల ధనము వ్యయించి నూఱు గుఱ్ఱములు త్యాగము కావించెను. దేవతారాధనము కావించి మజ్జనోత్సవము కావించి సంఘసమేతముగ నష్టవిధపూజన మాచరించి, యారాత్రికము కావించి మంగళదీప మర్పించి భావారాధన మొనరించెను. ఎనిమిది దినములందుండి శ్రీ వీరదేవున కుభయపార్శ్వముల దేవనాగముల నలంకారము కావించి, యన్నదానము లాచరించి శ్రీ సంఘీయుల నాదరించి, ధారాపద్రపురముచేరి శ్రీ సంఘమువారి గౌరవములంది, జినదేవునకు ప్రాసాదము నేర్పరచి లక్షలకొలది సాధువులకు నానాదానము లొనరించి కుమారపాల విహారమునకు సదృశ

మగు జైనమందిరము నిర్మింపించి ధర్మమును స్థాపించి కర్కరా నగరమున కరుదెంచి వీరధవళుని సందర్శించెను.

పిదప వీరధవళునితో వస్తుపాలుడు బయలుదేరి రాజధాని జేరి భేదోపాయమున సామంతపాలాదుల విడదీసి తన రాజునకు సేవకుల గావించి వీరధవళు నవమానించిన భీమసింహుని సమూలముగ నాశనము కావించి యుద్ధాపరాధముగ నైదుకోట్ల సువర్ణము, నయుతసంఖ్య తురగములను భీమసింహునుండి గ్రహించెను. వీరధవళుడు నరసింహుని, వస్తుపాలుడు రాజసింహుని యుద్ధమందోడించిరి. మంత్రి రాజానుమతితో మారవసోదరులకు రాజ్యములొసగి సామంతులుగ నియమించెను. వస్తుపాల మంత్రీంద్రుడు వీరధవళుని నాజ్ఞను విశ్వవిశ్వముల విరాజిల్ల జేయుచు రాజన్యరాజ సేవితుడై కల్పశాఖినలె రాజధర్మము లాచరించుచు ప్రకాశించుచుండెను.

## 3

భూదేవికి శృంగార తిలకమువంటి గోధ్రాపురము కలదు. దానిని ఘూఘులుడను రాజు పాలించుచుండెను. మహేంద్రనదీసుందరి మృదుశీతల తరంగకరంబులచే పుర ప్రియునిc గౌగలించుకొనుచున్నది. ఘూఘులుడు క్రూరుడు, విశ్వాసద్రోహి, గర్వి, రూపొందిన పంచమహాపాతకుడు.

వణిజ స్థారముల దోచుకొనుటలో మహాపండితుడు. ఆతడు వీరధవళుని శాసనము లెక్కించకుండెను.

వస్తుపాలుడు రాజానుమతితో రాయబారమును బంపెను. రాయబారియగు రేవంతు డరుదెంచి ఘూఘులు నితో "వీరధవళ మహారాజు విష్ణుసదృశుడు. సత్యాసక్తుడు. యశోదయానందనుడు. ఆతనికుద్ధవునితోడి జోడగు వస్తుపాలుడు మంత్రి! ఆ మంత్రి ప్రజ్ఞావైభవమును వర్ణింపదలచి బ్రహ్మ చతుర్ముఖములను, శివుడు పంచముఖములను, స్కందు డారుమొగములను శేషాహి రెండువేల నాల్కలను దాల్చియు దమకలవిగాక యూరకొనిరి. ఆతనికి ధీసఖుడై తేజఃపాలుడను సోదరుడు కలడు. వస్తుపాల తేజఃపాలుర నీతివైభవమున శుక్ర బృహస్పతులు. నీవు వీరధవళుని శాసనమును జాజులప్రసాదమునువలె దలదాల్పుము. కానిచో- యుద్ధరంగమున సాంగణ, చాముండ, భీమసింహాదుల మార్గ మనుసరింపు"మని సందేశమును వినిపించెను.

వృద్ధవానరమువంటి ఘూఘులు డీసందేశమును రోషమను మద్యపానమున జేసి యుచితానుచితముల, స్వపర తారతమ్యముల విస్మరించి మంత్రులను నోటికివచ్చినట్లు దూషించుచు "నీ పిరికికోమట్లు నాకీ సందేశమంపుదురా? వారియండజూచుకొన్న వీరధవళుని క్రొవ్వణగింతును. జింక శాసనము గొదమసింగము తలదాల్చిననాడు నేను వారి సందేశ మంగీకరింతును. అనుచితకర్ములగు నీ కోమట్ల

మంత్రాంగము వీరధవళుని బికారిని జేయగల"దని చెప్పు మనెను.

రాయబారి రేవంతు డీపూజ్యానిందనమునకుఁ గటకట బడి "యోయీ! పుష్పదంతులు, కారణజన్ములగు మంత్రులను నిందించి పాపమార్జించిన నీకాలము తీర్చుకొనుము. మంత్రిదీపములు ధర్మాంధులగు రాజులకుపయోగించునా? వైశ్యులు పిరికివారని నీవే చారిత్ర కేతిహాసికాధారములతో బల్కితివి? ఉదయనమంత్రి పిరికివాడా? ఆతని తనయుడు, కుమారపాలభూపాలుని మంత్రియగు నామ్రదేవుడు భీరువా? ఆతడు రాజన్యశ్రేణీమాణిక్యమగు మల్లికార్జునుని ఘోర సంగ్రామమునందు బరాజితుని కావించెనని యెఱుగగలవా? ఈ వ్యర్థప్రలాపములు మాని కర్తవ్యమాలోచింపు"మని హితముపదేశించెను.

ఘూఘులుడు వీరధవళునకు స్త్రీజనోచిత వేషభూషణములఁ గానుకలంపించెను. వీరధవళుడు మిసిమంతుడుకాక "గోధ్రాపతి తనకుచితమగు కానుకనంపి తనవంశాచారమును సూచించెను. తాను వీనిని దాల్పకుండునట్లు జాగ్రత్తపడు"మని చెప్పవలసినదని రాయబారిని సాగనంపి ఘూఘులు డోడించు మొనగాడెవడేని యిందున్న నీ జయతాంబూలమును గ్రహింపవలసినదనెను. ఎవ్వరును ముందునకు రాజాలకపోయిరి. వస్తుపాల ప్రేరితుడై తేజఃపాలుడు ముందునకువచ్చి తాంబూలమును స్వీకరించి యభినందనము లొందెను.

మరునాడు వస్తుపాల తేజఃపాలురు గురువుల దర్శించి ధర్మోపదేశమును స్వీకరించిరి. అర్హతపూజల వలన సామ్రాజ్యాధిపతియైన సుందరశ్రేష్ఠి తనూజుని విచిత్ర చరిత్రము వీనులార విని పూజనము లొనరించి దానము లాచరించి తిరిగివచ్చిరి. తేజఃపాలుడు సర్వసైన్యముతో దండునడిపి ఘూఘులుని గోవుల గ్రహించి తనసైన్యముతో నాతని దూరమున కెలయించికొనివచ్చి రణమున దనకుదోడైన కపర్ది సురాధీశ్వరుని, అంబికాసురీశ్వరి మహిమలకలరి ఘూఘులునితోబోరి క్షణమాత్రమున వానిని గుఱ్ఱమునుండి పడద్రోసి కాష్ఠపంజరమున బంధించి, యాతనిరాజ్యమున సింహాసనుడను వానిని స్థాపించి యజితస్వామికి ప్రాసాదము నిర్మించి వటపద్రపురముచేరి యారాజు భక్తికి సంతసించి యచ్చటి జినాలయము నుద్ధరించి యుత్కటపురమం దాలయమేర్పరచి, వనాభిధమందు చైత్యము నిర్మించి, దర్భావతి చేరి దానికి వప్రము నిర్మింపజేసి వారి చోరభయమును బోద్రోలి చైత్యము నేర్పరచి యందు తన సోదరునిమూర్తిని ప్రతిష్ఠించెను. సప్తజినాలయముల నేర్పరచెను. ఆ యాలయములందు దన ప్రతిమూర్తిని నేర్పరచెను. తన తల్లియగు కుమారదేవి విగ్రహమును స్థాపించి యామె చేతులందు వెండిపూదండ నమరింపజేసెను. వైద్యనాథ శివాలయ మంటపమునకు బంగారు కలశములుంచి గర్భగృహమందు వీరధవళ జయతలాదేవులకు, తనసోదరులకు ప్రతిమూర్తులు గల చైత్యము నిర్మింపజేసెను. ఆ చైత్యమునకుఁ దొమ్మిది

బంగారు కలశముల స్థాపించెను. దానికిఁ బశ్చిమమున నుత్త
రమున నన కీర్తికి మంగళపాఠకులుగ నున్న రెండు ద్వార
ములు నిర్మించెను. స్వాజలసంపన్నమగు స్వయంవరమహావాపి
కను, నుత్తరద్వారమున వైద్యనాథహాయనకు ప్రీతికరముగ
చంద్రకాంతమణి తోరణము నిర్మించెను. రాజగృహమెదుట
రెండంతస్తుల బంగారు కలశముకల మండపమేర్పరచెను.
కాలక్షేత్రమున దనరాజు పేరుతో వీరేశ్వర దేవకుల చైత్యము
రేవాసాగర సంగమమందు నిర్మించెను. కుంభేశ్వరతీర్థమందు
సర్వాంగ ధర్మసామగ్రులు గల ఋషిమంటప పంచకము
నిర్మించెను. పావకపర్వత మారోహించి యాదిజినేశ్వరున
కున్నత చైత్యము నిర్మింపించి, యర్బుదపర్వతమునే నేర్పరచి
చైత్యమునకు దేవతాప్రతిమ లలంకరింపజేసి యంబికా
ప్రాసాదమున నేమిప్రాసాదము నేర్పరచెను. మంత్రీంద్రుడు
సర్వతోభద్ర ప్రాసాదమున నష్టాతులకు నిర్మింపజేసి సపరివార
ముగ రాజధానిజేరి సోదరపరివేష్టితుడై వీరధవళుని కడకరిగి
దర్శించి ఘూఘులుని గాన్పింపజేసి యాతని కడనుండి కొని
వచ్చిన సర్వసామగ్రుల సమర్పించెను.

శ్రీ వీరధవళుడు మంత్రీంద్రుని సాదరముగఁ గౌగ
లించుకొని విశ్వవిశ్వద్రోహియగు గోధ్రాధిపతికి మున్నా
తడు తనకంపిన స్త్రీజనోచిత వేషభూషణము లలంకరింపజేయ
మహామానియగు ఘూఘులుడు వాడిగోళ్లతోఁ దననాల్కఁ
జీల్చుకొని దుర్మరణమొందెను. సభచాలింపబడెను. మంత్రు
లిండ్లకరిగిరి.

ఒకనాడు మహారాజు నిండుకొలువుండి వస్తుపాల తేజఃపాలుర నాహ్వానించి కోటిహేమము లొసగి సత్కరించి కవీశ్వరుడగు సోమేశ్వరునిచే తేజఃపాలుని స్తుతింపజేసెను. తేజఃపాలుడు కవీశ్వరునకు మూడులక్షల బంగారు నాణెము లొసగెను. మహారాజు పట్టపుటేనుగుపై తేజఃపాలు నెక్కించి శ్వేతచ్ఛత్రమలంకరించి సాగనంప నతడు సహోదర్యుడై చామరవీజ్యమానుడై కీర్తికల్లోల కారకములగు దానము లొసగుచు గృహమేగి సోదరీమణులొసగు నీరాజనము లందు కొని వారి నానందతరంగితుల గావించి సుఖముండెను.

మంత్రిసోదరు లొకనాడు గురువుల దర్శింపనరిగి ధర్మోదేశన మాలకించి గురుపాదవందన మాచరించి, పేద లకు దానములు కావించి యిల్లుచేరి దేవపూజాతిథ్య భోజ నాద్యుచిత క్రియలు కావించి "కృపణులకు గృహకూపము, వ్యయపరులకు నగరవాపి, వ్యాపారులకు సరసి, రాజులకుఁ దరింగిణి లక్ష్మీకరములు. పుత్రవత్సలుడగు భర్తను దుశ్చా రిణియగు భార్యవలె శరీరమును గాపాడుకొనువానిని మృత్యువు, ధనము దాచుకొనువానిని భూమియు బరిహ సించుచున్నవి. రాజసేవాలబ్ధయగు సంపదంగనను సార్థకము కావింపవలయు"నని మంత్రులు తలచిరి. వివేకవంతుడు ధర్మకార్యములం దేమరుపాటు చూపడుకదా! వస్తుపాలుడు శత్రుంజయ శత్రుంజయవతార జినదేవునకు ధవళకర్పూర మందాలయ మేర్పరచెను. ఆ చైత్యమం దిరువది నలువురు తీర్థేశ్వరులున్నారు. కపర్ది దేవతాదేశమున శత్రుంజయ

దైవతము నా పట్టణమున స్థిరపరచెను. అందిరువదినాల్గు జినేంద్రభవనము లున్నవి. బంగారు కలశము లమరించిరి· వస్తుపాలుడు శత్రుంజయ ప్రాసాదమును దేజఃపాలుడు జయంతావతార చైత్యప్రాసాదోపమగు త్రైలోక్యసుందర చైత్యము నేర్పరచిరి.

ఒకనాడు సోమేశ్వరకవి యాసోదరుల ధర్మకార్య తత్పరత కానందించి యిట్లు స్తుతించెను. "మార్గమందొకడే ఘోరాదను నియమ మనుసరించి యీ సోదరులు సంస్మృతి మోహదూరులై ధర్మమార్గమున ప్రవర్తించిరి. వస్తుపాలుడు జనవ్యామోహవల్లియగు లక్ష్మీమతల్లిని గొనివచ్చి ధర్మ కల్పవల్లిని గావించెను. అర్థులు శరణాగతులు సుముఖులై యాశ్రయించెడి వస్తుపాలుడొకడే శ్లాఘ్యుడు, సర్వోత్తము డగుచున్నాడు".

"తేజఃపాలు డెచ్చటను రోగములురానీక, సంకరము కానీక, పతనమునందనీక వ్యాకరణశాస్త్ర మర్యాదయగు నుపసర్గ, వర్ణవికారనిపాతముల బ్రోద్రోలెను".

మంత్రిసోదరులీ స్తుతులకలరి యాకవికి మూడులక్షల ద్రమ్మములొసగిరి. లోకమున దానమున కింతయని నియ మముకలదా? ఔదార్య మనస్కులకు వేలు, లక్షలు, కోట్లను సంఖ్యానియమములేదు. సర్వరత్న సంపూర్ణమగు భూమండలమైనను వారి దానవ్యసనమున కాగజాలునా?

మంత్రీశ్వరులిట్లు దానము లాచరించుచు, ధర్మస్థాపన మాచరించుచు, ప్రజలకు హర్షప్రకర్షత గూర్చుచు, వీర ధవళుని మానసరాజహంసలై, వంశాలంకారులై కవి పండిత కల్పతరులై వాసికి వన్నెకెక్కుచుండిరి.

౪

వస్తుపాలుడు వీరధవళానుమతింతో రాజులకుఁ గల్ప శాఖవలె నాశ్రయ మొసగుచుఁ గలికాలమును జయించి రాజ్యకార్యములందు తనకుఁ బ్రతినిధిగ సోదరుడగు తేజః పాలుని నియమించి శ్రీ సంఘులోకము నర్చించి బంధు మిత్రుల మంగళాశాసనము లంది నిస్సాణధ్వానములు దిక్ప తుల బెదరించుచుండ, సర్వోత్తమ ముహూర్తమున వైరి ముఖదర్పణముల శ్యామలములఁ గావించుచు చలాచలహాయ శ్రేణుల గిట్టలనుండి ధూళులు రేగుచుండ శ్రీ స్తంభతీర్థము నకుఁ బయనమాయెను. ఆ వార్తవిని యచ్చటి సకలవర్ణ ప్రజలు కానుకలతో నొకరినొకరు దోసికొనుచు నానా వాహనములారోహించి సంపదలవలె నరుదెంచిరి. దానకర్ణు డగు మంత్రివారిని దాన మానాదులచేఁ దృప్తిపఱచి నగ రము ప్రవేశించి తనరాకతో నగరమునుండి కలిపురుషుడు పారిపోయెనన్నట్లు దుష్టనిగ్రహము కావించి కుమారపాల చైత్యమున కేగి నమస్కరించి దుర్గములోఁ బరివారముతో

నివసించెను. ప్రజలు మంత్రిరాకకు సూచకముగ వివిధోత్స వములు కావించిరి. మంత్రి తూర్పుదిశయందలి నానా పురాధికారుల బిలిపించి యాదాయ వ్యయముల సరిచూచి వారిని దన యాజ్ఞావశవర్తుల గావించుకొని సాగనంపెను.

ఒకనాడొక వైశ్యపుత్రుడు మంత్రీశ్వరుని దర్శించి యిట్లు మనవిచేసికొనెను. దేవా! ఈ పట్టణమందే అసీమ శ్రీసాగరుడగు సగరుడనువాడు కలడు. అతడు ప్రాగ్వాట వైశ్యకులాలంకారుడు. అతడు కొన్నాళ్లకు పేదవాడై సదీకు డను ధనికునాశ్రయించి కుటుంబ నిర్వాహణ మొనరించు కొనుచుండెను.

ఒకనాడు సదీకుడు సగరశ్రేష్ఠిని సముద్రవ్యాపారము నకు బంపుచు నష్టములకో నిమిత్తములేకుండ లాభమునందు నాల్గవపాలు నొసంగెదననెను. సగరుడు సాగరుని బూజించి వివిధయాన పాత్రలతో యాత్రగావించెను. అతని పూర్వ పుణ్యమువలన స్వర్ణధూళి లభించెను. దాని నాతడు గుప్త ముగ దాచి మహాప్రయత్నముతో దన ఇంటికి దెచ్చు కొనెను. సదీకుడా విషయమెరిగి సగరుని సర్వస్వమును దోచు కొని రహస్యముగా జంపించెను. నేనా సగరుని కొమరుడ నాపేరు దేవశ్రేష్ఠి (దేవుడు) యను వాడను. నేను నిన్నాశ్ర యించి ఆ స్వర్ణములో చతుర్థభాగమును పొందగోరితిని. ఆ పాపాత్ముడగు సదీకు నెదురించునంతటి వాడనుగాను. అతనికి పదునాల్గువేల సైన్యము గలదు. నాల్గువేల గుఱ్ఱములు,

మున్నారు గజములు కలవు. సర్వజ్ఞుడవు ఆశ్రితరక్షకుడవగు నో మంత్రి సత్తమా! నన్ను కాపాడుమని ప్రార్థించెను.

కృపాపీయూష సాగరుడగు వస్తుపాల మంత్రీశ్వరు డాతని మనవి నాలకించి ఇట్లు చింతించెను. "లోకమున దుర్మార్గుడు బలవంతుడై బలహీనులగు సాధువుల బాధించు చున్నాడు. నేనధికారమందున్నను సదీకుడు ద్రోహి యాయెను గదా? దుంఖితులందు దయజూపనివాడు, ఆశ్రితు లను బోషింపనివాడు ప్రభుత్వము నొందియు నసమర్థుడగు చున్నాడు. కాకులుసైతము జాతి పక్షపాతము చూపు చున్నవిగదా?"

మంత్రి క్షణమిట్లాలోచించి కోపించి గోరోజనము వంటి ముఖవర్ణముతో "ఓ దేవశ్రేష్ఠీ! నీవు నిశ్చింతుడవై యుండు"మని ఆతనిని దన కోశాధిగార లేఖకునిగా నియ మించెను.

వస్తుపాలు డాపట్టణమున జినమందిరములందు బూజలు, ఉత్సవములు జరిపించి తన భట్టును సందేశ పూర్వకముగ సదీకుని గృహమునకు బంపెను. ఆతడు సదీకు నకు వస్తుపాలుని సందేశము నిట్లు వినిపించెను. "శ్రీమంతు లలో గొప్పవాడవగు నీవు దానశీలముతో గర్పూరధూళుల వంటి కీర్తినార్జించితివి. ఐనను స్నేహమున జేసి హితముప దేశించుచున్నాను. వినయము గుణములకు రాజు. లా ణ్యములేని యంగనలవలె వినయములేని చాతుర్యాది గుణ ములు రాణింపవు. ప్రాణుల దుర్మదము సద్గుణశ్రేణిని

ద్వేషించుచున్నది. కాన నీవభ్యుదయ మొసగు వినయ మవలంబించి నిర్భయుడవై నన్నాశ్రయించి సుఖింపుము".

సదీకుడు భట్టువాక్యములు గర్వాతిథులగావించి మండి పడెను. "వందలకొలది రాజులను, వేలకొలది మంత్రుల నెఱుగుదును. కాని నాకెవ్వరును నిట్టి సందేశమంప సాహ సింపరైరి. వారెల్లరు కార్యార్థులై సముద్రమును గలియు నదులవలె నాకడ కరుదెంతురు. నేనెవ్వరింటికి నేపనికి బోయి యెఱుగను. కూపమండూకము వంటి యీమంత్రి మిత్రునకై నేను నూత్నమార్గ మవలంబింతునా? నందనవనమందలి కల్ప తరువువలె నేను నాయింటనుండియే యాచకుల బ్రోచు చున్నాడను. ఎలుకకు బియ్యపుగింజ దొరకినట్లు నీచునకు కించిత్సంపద కలుగుటచే నాతడు పారవశ్య మొందుచున్నాడు. మీ మంత్రి తన గర్వమువదలి నాకడ కరుదెంచి సంభాషిం పవలసినదిగ దెల్పు"మని ప్రత్యుత్తరము పంపెను.

వస్తుపాలామాత్య శేఖరుడు భట్టువలన సదీకుని ప్రత్యుత్తరము విని "ప్రాణుల మాహాత్మ్యము చైతన్యమును దిర స్కరించుచున్నది. సంపదమదిరవలె వీరల బరవశుల గావిం చుచున్న"దని తలపోసి మరల సదీకునకు నిట్లు రాయబార మంపెను. నీవిక నీయింటియందేయుండి నీ యాదరము కాపాడుకొమ్ము. సర్వుల నవమానించు నీ దుర్వినయము న్యాయధర్మ నిష్ణాతుడనగు నేను సర్పదష్టాంగుళివలె ఛేదించి ధర్మమును గాపాడెదను". భట్టు తెల్పిన యీ సందేశమున

కును సదీకుడు వినాశకాలమున విపరీతబుద్ధియన్నట్లు గర్వ పర్వతశిఖరావరోహణ మొనరింపకుండెను.

సదీకుడు మంత్రి బలసంపద నెఱిగి వడూయపుర మందలి తన మిత్రుడగు శంఖున కీవిషయము తెలియ జేసెను. ఆతడు దుర్గర్వముతో, మిత్రపక్షపాతముతో బలా బలములు పాటింపక సముద్ర ప్రాంతీయుడనను ధైర్యముతో నిర్భయుడై వస్తుపాలునకిట్లు సందేశము పంపెను. రాయబారి వస్తుపాలుని దర్శించి "జగజ్జనమనోభీష్టార్థ చింతామణియగు నీ మంత్రీంద్రుడు జయించుగాక! గుణవంతు లుదరపోషణము నకు దేశాంతరముల కేగుచుందురుట తెలిసికొని వారిని గొని వచ్చి సకల సంపదలదనిపి, శత్రువులను వందిమాగధ స్తుతు లచే నాహ్వానించి ఘోరముగ పోరాడు వసంతపాల మంత్రిని స్తుతించుట కెవడు సమర్థు"డని స్తుతించి లేఖనొసగెను.

"వడూయ పట్టణప్రభువు శంఖపాణి సదృశుడగు శంఖుడు శ్రీ వస్తుపాలున కిట్లాజ్ఞాపించుచున్నాడు. మా సప్తాంగశోభితమగు రాజ్యము కుశలము. మీ కుశలములను సుధావర్షములచే మాకు ప్రీతిని గల్గింపుము. న్యాయధర్మ ధురీణుడన్ను, వీరశ్రేణిశిరోమణినగు నా స్నేహామువలన నీకొక ప్రయోజన మెఱిగించుచున్నాను. సదీకుడను నా మిత్రుని పితృసమునిగ గౌరవించి నా యనుగ్రహ మార్జించుకొనుము. లేనిచో నీ క్షేమము కాంచజాలను".

వస్తుపాలు డీసందేశము విని మాగధుని సత్కరించి సాగనంపి శంఖునికడకుఁ దన కవిభట్టును లేఖనొసగి పంపెను.

ఆతడు శంఖునికడకేగి యుత్తరమొసగెను. మంత్రివలన రాజీ లేఖను జదివించుకొనెను. " "సర్వమంగళా సంశ్లిష్టుడగు వృషభధ్వజుడు జయించునుగాక! శ్రీ పార్శ్వనాథదేవుడు సంపదలొసగుగాక! శ్రీ వీరధవళ పాదపద్మమధువ్రతుడగు వస్తుపాలుడు శంఖమండలేశ్వరునకు ససేన్నహముగ పంపించు సందేశము. మిత్రమా! నీవిజ్ఞప్తి వింటిమి. న్యాయానాము ప్రకాశకుడవగు నీవు సజ్జనపక్షపాతివని తలచితిని. కాని నీవు దుష్టపక్షపాతివి. దుర్గర్వియగు సదీకుని స్నేహము నీకు మంచిదికాదు. సదీకుని నేను సేవించుట యటుంచి నీవాతనిని గాపాడుకొనుము. బంగారు విహంగమము మశకాదేశ ముల్లంఘించినట్లు నేను నీమాట వినదలచుకొనలేదు. ప్రేతా లయమందలి వానికి భూతములు భీతికొల్పునా? భానుబింబా శ్రితుని దమములేమి చేయగలవు? నీవీ విషయము 'లాలో చించుకొని యొకప్పుడును పశ్చాత్తాప పడకుండు మార్గ మనుసరింపుము".

శంఖుడీ లేఖావిషయము విని శంఖాసురునివలె మండి పడి వికటభ్రూకుటితో నీ కిరాటకుల పాంసనుడు తన కుచిత ముగ నుపదేశించెను. ప్రాణులకు వంశానుసారములగు పలు కులే నోటవచ్చుచుండు"నని పలికి భట్టును సాగనంపి యుద్ధ సన్నాహము లొనరింపసాగెను.

వస్తుపాలుడు వైతాళికునివలన శంఖునివిషయ మెఱిగి శ్రీ వీరధవళాధీశ్వరు నాజ్ఞమేరకు రాజులనెల్లర బిలిపించి సర్వసన్నాహము లొనరించి శంఖరాజ జిగీషతో బయలుదేరి

శుభసూచకములగు శకునముల కలరుచుండెను. ఆ దండ యాత్రకుబోవు మంత్రికిరుప్రక్కలం గపర్దియక్షుడు, సురీశ్వరి యగు నంబికయుదోడై నడచుచుండిరి. మహాబలుడు సాధు లోకానుకూలుడగు మంత్రికి మహాబలుడగు వాయువు మృదువుగ ననుకూలముగ వీచెను. నానావాద్యధ్వానములు, వందిమాగధ జయజయారావములు రోదసీకందరాంతరమును ధ్వన్యద్వైతమయ మొనరించెను. శంఖరాజు దేశసీమ నాక్ర మించి మంత్రీంద్రుడు స్కంధావారము నేర్పరచెను. భువన పాల మహారాజు, మారనసోదరులు స్వసైన్యములతో బయలు దేరి గంగాప్రవాహములు సాగరమున లీనమైనట్లు మంత్రీశ్వ రుని గలసికొనిరి. ప్రత్యర్థులు వచ్చినపుడు, యాచకులు దైన్యమందినపుడు తమ యసువుల వసువుల నెవరు లెక్కిం తురు? నగరస్వాములు, గ్రామస్వాము లాహవరంగమున కరుదెంచిరి.

సింధురాజాత్మజుడగు శంఖుడు మంత్రీంద్రుడు సీమా తిక్రమణ మొనరించెనన్న వార్తను చారముఖమున విని ప్రౌఢవాయువువంటి తేజస్సుతో సముద్రమువలె సర్వాంగ ములతో విజృంభించెను. శస్త్రదేవతల బూజించి శంఖుడు జైత్రయాత్ర బయలుదేరెను. ఆతని బావమరది కొంకణ రాజు భూరివిక్రముడు వచ్చెను. ఆ వీరరాజు లాతనికి సాయ మొనరింపవచ్చిరి.

ఉభయసైన్యములందలి వీరకుంజరులు నిర్విదానము లగు దానములచే యాచకుల దృప్తిపఱచి దేవతార్చనలు

కావించి యుత్కంఠతో వేచియుండ యుద్ధవాసరము రానే వచ్చెను. ఉభయసైనికులు విజృంభించిరి. గుఱ్ఱముల కాలి ధూళి గజములమద జలములబాపెను. శంఖుడు మర్వారుడై రణరంగమున సంచరించెను.

వస్తుపాల మంత్రి తనసైన్యమునకు జేయివీచెను. జయ శ్రీవరణోత్కంఠులగు వీరులు దేవతాబలోల్లాసులై విజృంభించిరి. అశ్వరాజమధిరోహించినమంత్రిని విస్మయపడుప నొక కవి యిట్లుస్తుతించెను. "పుణ్యాత్ముడగు వస్తుపాలుడు రామచంద్రుని వంటివాడు. రాముడు ఖరదూషణుల వధించెను. మంత్రి కటుదూషణములు లేనివాడు. వీరిరువురు క్షీరాబ్ధి సదృశకీర్తిద్యుతులు. లోకదూషకుల నాశనము నిరువురును గావించిరి" మంత్రి యతనికి లక్షద్రమ్మము లొసగెను. దానధర్మములు రణరంగమున జయశ్రీ వరణము నకు దూతికలు!

ఉద్దండ పౌరుషుడు కోదండపాణియగు మంత్రి శంఖుని సమీపించెను. భువనపాలాదిరాజు లహంపూర్వికముగ ముందునడచిరి. సైన్యమునకు ముందున్న వస్తుపాలుని జూచి శంఖుడు కత్తిని దళతళలాడించెను. కాని-రోహిణి మీది రోషమున క్రూరుడైన శని దశరథు నతిక్రమింప జాలని రీతి శంఖుడు సచివసైన్యములోనికి బోలేకపోయెను. తుముల యుద్ధము భీకరముగ సాగెను. సుభటులు భ్రూయుగ్మములతో ధనస్సు లెక్కిడిరి. వీరులకు విగ్రహము సాగెను గాని వారి కోదండములకుఁ గాండములతో సంధిజరిగెను.

కొందరి కర్ణాసక్తములగు బాణములు కొందరి జీవితమును వ్యయింపజేసెను. కొండెగాంద్ర దుర్జన చేష్టితము లిట్టివేకదా! సంగ్రామ క్షేత్రమున గుణనిర్గతములగు విశిఖములు సూర్యుని భేదించి పరమపురుషునిలో లీనమైనవి. శిలీముఖములు తూణీరములనుండి ధనస్సుల నాశ్రయించినవి. కత్తులతో కత్తులవారు, కుంతములతోఁ గుంతములున్నవారు, రథికులు రథికులు, నాశ్వికులాశ్వికులు పోరిరి. రణక్షోణి రేణువులు నిండిన వీరుల దేహములు కుంకుమకర్దమము లలదినట్లుండెను. దీర్ఘనిద్రనొందిన వీరుల కెండతగులకుండ బాణపంజరము లంపశయ్యా లేర్పరచియుండిరి. తమను వరింపదలచివచ్చిన యప్సరసలజూచిన సంతోషముచేవలె వీరుల కబంధములు నర్తింపసాగెను.

శత్రువులు గురిచూచివదలిన బాణములు దేవతాబలోల్లాసియగు మంత్రీంద్రుని సమీపింప జాలవాయెను. మంత్రిసైనికులు తమసైనికుల జంపుటచూచి సంగ్రామసింహుడు భుజదండపాండితినిజూటఁ బాణములకు దెగించి భువనపాలు డెదుర్కొన శంఖుని స్నేహితుడు సామంతరాజు వారినడుమఁ బ్రవేశించెను. భువనపాలుడు సామంతునంత కాంతికమునకు బంపగా జాటునుండి శంఖుడు భువనపాలుని సంహరించెను గాని యాతని యఖండ పౌరుషమును ఖండింప జాలకపోయెను. వీరముగ మంత్రిసేనానియగుటచే శంఖుని సేనానియగు జయంతునితో బోరి యాతనితో బాటు వజ్రిసభ కేగెను. సంగ్రామసింహుని సోదరుడు రణసింహుడు సామంత

సింహునితో బోరి మరణించుటచూచి శంఖుడు తీక్ష్ణబాణ ప్రయోగమున దొంగచాటుగ వానిని జంపెను. కదళీగర్భ కోమలాననుడగు శంఖుని బావమరది మంత్రిసూర్యుని ప్రతాపమున కోర్వలేక పారిపోయెను. మంత్రీంద్రుని చండకోదండ దిషక్షండన కౌశలమునకు శంఖుడానందించి సాత్వికోత్పుడు జోత్తమునివలె వికారవర్జితుడగు వస్తుపాలుని ప్రబోధించి కోపసంపన్నునిగావించి కపర్ది యక్షాంబికా ప్రభావమున నస్తంగతుడగు సూర్యసదృశుడై తన మహిష్యుక్తులతోబాటు శంఖుడు మూలమూలలకు బారిపోయెను. దేవతలు శంఖుని వస్తుపాలుడు జయించెనని ఘోషించి పుష్పవర్షము కురియ జేసిరి.

ఒక కవి మంత్రినిట్లు స్తుతించెను "మంత్రీశ్వరా! సీ రణకౌశల మపూర్వము. మాటిమాటికి నీపదములకుూర్పు, ఓజోగుణము విజయించుచున్నవి. వసంతపాలకవి శంఖుని జయించెనని తెలుసుకొంటిని". కవికామధేనువగు మంత్రీం ద్రుడాతనిని గౌరవించెను. పిదపమంత్రి శ్రీ స్తంభతీర్థమున కరిగెను. ఆకాశమున సింహయాన దేవత యిట్లుచాటెను. సింహభటుని సోదరుడగు సింధురాజు తనయుడు శంఖుడు వస్తుపాల మంత్రిని నెదురుకొని పరాజితుడాయెను. "మహా మంత్రీశ్వరుడు వాద్యధ్వనులు దిగ్గజముల బెదరింప సదీకుని గృహము ప్రవేశింపరాగా నాతని పదునాల్గువేల సైన్యము క్షణములో నోడిపోయెను. మంత్రీశ్వరుడు సదీకుని కోశా గారము ప్రవేశించి వేయి బంగారపు టిటికలు, డెబ్బదివందల

గుఱ్ఱములు, రత్నమాణిక్య మౌక్తిక వ్రాతములను గ్రహించి పట్టణము ప్రవేశించి కుమారపాల ప్రాసాదమం దుత్సవములు జరిపించి శ్రీ సంఘము నర్చించెను. దేవశ్రేష్ఠి కాతని స్వర్ణ ఘూళి చతుర్థభాగ మనుగ్రహించెను.

పిదప వస్తుపాలుడు రాజధాని జేరి హేమాశ్వమాణిక్య ప్రాభృతములతో వీరధవళు నానందింపజేసెను. అప్పుడొక కవీశ్వరుడు మంత్రీశ్వరు నిట్లు సంస్తుతించెను. "ప్రతిపక్ష కాలుడవగునో వస్తుపాలుడా! వార్ధితీరమున మత్స్యరూపము దాల్చకయే శంఖునోడించిన నీవు విష్ణుదేవు నతిక్రమించితివి. ఒక శంఖము భగ్నము కావించి లోకమును గీర్తిధవళితము కావించిన నీపాండిత్య మపూర్వము. నీ తాంబూల సేవన మందు శంఖము చూర్ణమైనది. లోకమున నీకెవడుసాటి! లోపాముద్రా ప్రియుడగు నగస్త్యుని చేతిలోనికి రానంత వఱకు సముద్రము నదులను దనలో కల్పుకొనుట, యలలతో ప్రకాశించుట, తీవ్రధ్వనితో మ్రోగుట, చివరి హద్దు తెలియకుండుట, కమఠ మకరముల గుంపుల దాచుకొనుట మొదలగు పనుల గావించును గాని యాపైన నేమికావింప గలదు?" శ్రీమంతుడగు రాజసచివ స్తుతివిని కవికి నాలుగు వేల దీనారములొసగెను. 'నదీకాన్వయసంహారి, శంఖమాన విమర్ది, జ్ఞాతిపాలన ప్రోల్లసత్పుణ్యప్రవాహ వరాహ' యను బిరుదుల మంత్రికొసగెను.

పిదప మంత్రి తనయింటికివచ్చి యుత్సవములు కావించి రాజమాన్యుల గౌరవించి, యాచకుల కోరికల దీర్చి

జైనదర్శన మారాధించెను. రణమందలి మారణపాపశాంతికి కోటి సువర్ణముల వ్యయించి సత్కార్యములు కావించెను.

వస్తుపాలుఁడు మరల నొకమారు రాజాజ్ఞనొంది స్తంభ తీర్థపురవాసులకు న్యాయధర్మవిశుద్ధి కల్గించుటకేగి యా పురమును బాలించుచుఁ గలిని నశింపజేసెను. అన్యాయ వర్తులగు పరిసరగ్రామాధికారుల శాసించెను. దుర్దాంత శత్రు రాజుల ఛేదించి సామంతుల గావించెను. శత్రువుల శిక్షించిన ధనముతో మంత్రి జినమందిరముల నానా ధర్మాధికార నివాసముల గావించుచు నా దేశమందలి ప్రతి గ్రామము, ప్రతి పురము, ప్రతి పట్టణము, ప్రతి పర్వతము, తీర్థముల గావించుచు నా భూమిని తీర్థకల్పము కావించెను.

ఒకనాఁడు వేలాకూలాధిపులగు కేశిరాజాదులు తమ రాజ్యముల దాయాదు లపహరింపఁ దమపదవినుండి భ్రష్టులై శరణ్యుఁడగు సచివేంద్రు నాశ్రయించిరి. అదీనాధీశ్వరు లయ్యు ముఖమున దైన్యము కలిగియున్న కేశిరాజాదుల జూచి కరుణాసాగరుఁడగు వస్తుపాలుఁడు వాహినీ పరివృతుఁడై యాయా ద్వీపముల కరిగి యర్జునునివలె నతిశయించి రాజులనుగెల్చి కాశిరాజాదుల యథాస్థానముల బ్రతిష్ఠించి 'రాజేంద్రస్థాపనాచార్య' బిరుదమందెను. కులహాత్థస్వామి చామీకరాసుల నంపెను. సింహాళరాజు పదిగజముల, శత తురంగముల, స్వర్ణరాసుల నప్పగించెను. మల్లద్వార మహీశ్వరుఁడు సువర్ణలఠాష్టకము లొసగెను. వస్తుపాలుఁడీ కప్పముల గైకొని స్తంభతీర్థపురము ప్రవేశించెను.

శ్రీ శత్రుంజయ పర్వతాధిష్ఠాన దేవతయగు కపర్ది యక్షుడు, గిరినారగిరీంద్ర స్వామినియగు సింహవాహనయు మంత్రిపుణ్యములకుఁ బ్రసన్నములైన వనిధులుగల భూమిని మంత్రికి జూపించిరి. మంత్రి యా నిధులవలన గలిగిన ధన ధాన్యములతో నా సమీప పురములందు మిక్కిలి ధర్మ స్థానముల నేర్పరచెను.

వస్తుపాలుఁడు రాజ్యమేలుచుండఁగా గాటకములు కలుగకుండెను. అనీతులతో నీతులు నశించెను. పుణ్యాత్ములు ప్రతిష్ఠనొందిరి. ఈ కలియుగమునందును లోకమున రామ రాజ్యమును సాక్షాత్కరింప దలచిన మంత్రి విలువగల వస్తువుల నడవులలో బడవైచినను, బల్లెలందలి, వనములందలి వృక్షములకు దుకూలములు కప్పినను, బంగారము, మాణిక్యములు, రత్నములు వెదజల్లినను బ్రజలలో జౌర్యబుద్ధి జనింపకుండెను. సూర్యుడుదయపర్వత మధిరోహింప జీకట్లు నశించినట్లు మంత్రిపాలనమునఁ గ్రూరకర్ములు పోషనూప కుండిరి. బాటసారు లడవులలో హేమమాణిక్య రత్నాభరణములతోఁ బయనించినను నాపద నొందకుండిరి. పశు పక్ష్యా ది లు సహజవైరముల వదలెను. జను లెల్లరు సదాచారము లవలంబింప ద్విజిహ్వులు పాతాళము నాశ్రయించిరి. ప్రతియింటను ధనధాన్య వస్తువాహన సంపదలు సంతాన మంగళములు వృద్ధియైనవి.

వస్తుపాల మంత్రీశ్వరునకు పదునెన్మిది వందలమంది సుభటక్షత్రియ మంత్రులుండిరి. సేవాకారకులు, సంగ్రామ

శౌండీకులు మహాజనుల్కలను రాజపుత్రులు పదునాల్గు వందలనుండి సేవకులుండిరి. నాలు సమాన భోగ, శృంగార, రస, నాసన, భోజనములై యుండిరి. పెక్కుయుద్ధము లొనరించిరి గెలిచిరి. ఐదువేల జాతి గుఱ్ఱములు, రెండయుతములు సామాన్యాశ్వములు. ముప్పదివేల యావులు, రెండు వేల వృషభములు, బఱ్ఱె, లొంటెలు, మన్నలు వేలకొలదిగ నుండెను. అయుతసంఖ్య దాసీదాస పరివారముండెను. మూడువందల యేనుగులు, నాలుగుకోట్ల సువర్ణములు, నెనిమిది కోట్ల రజతములుండెను. రత్నమాణిక్యమౌక్తికము లసంఖ్యాకములుగ నుండెను. కోశాగారమందు నారువందల కోట్ల ద్రమ్మములుండెను. ప్రతినిత్యము లక్ష ద్రమ్మములు వ్యయించును. విశేష ధర్మకార్యములందు వ్యయించు ధనము నిరవధికము. దీనార్తులకు, గుణవంతులకు బదివేల ద్రమ్మముల వ్యయించును. అర్హతులకు లక్షలద్రమ్మము లొసగును. పశువులకు నీరు, పచ్చికలిచ్చు స్థానములు, ధర్మ ఘంటలుగూర్చిరి. సకల వ్యసనములు నశించినవి కాని దాన వ్యసనము హెచ్చు పెరిగినది.

వస్తుపాలుడు తేజఃపాల సమేతుడై గురువులకు మ్రొక్కుట కొకనాడు ధర్మశాలకేగి ధర్మాదేశన మాకర్ణించెను. నరచంద్ర గురువులకు మ్రొక్కి మంత్రిసోదరులు అన్నదానము లాచరించుటకు సర్వసామగ్రీ సంపన్నములగు సత్రములను భూమండలమందలి నానా పురగ్రామములందు నేర్పరచిరి. అన్ని సత్రములందు నతిథులు రుచికరములగు

మిష్టాన్నములను భుజించుదురు. దీనార్తులు ధన్వంతరులవంటి యాయుర్వేద వైద్యులసాయమున నీరోగులగుచుందురు. వైద్యవసతియు పరిచారక వసతియు మంత్రీంద్రులు సత్రము లందేర్పరచిరి. భోజనానంతరము తాంబూలము సుగంధ మాల్యవిలేపన మొసగుదురు. వస్త్రదానములు కావింతురు.

ఈ విధముగఁ బ్రాహ్మణుల సంతోషపఱుచుచున్న కృపాల వాలుడగు వస్తుపాలు నొక కవి యిట్లు స్తుతించెను. "అచింత్యదాతయు, నజాతశత్రువగు వస్తుపాలు నెవరాశ్ర యింపరు? ఆతనిముందజాతశత్రుడగు ధర్మరాజు, చింతా మణి తనుపేర్ల సార్థక్యమును గోల్పోవుచున్నారు. కల్ప వృక్షము లజ్జాభరమున గంటికిఁ గానరానిదాయెను. ప్రార్థనా దైన్యము కల్గించుచు నిచ్ఛలఁ దీర్చుచు స్వల్పహృదయ ముతో పుణ్యపణ్యము కాకుండ నున్నదని తలచి వ్యసన పరవశమగు లోకమునుజూచి బ్రహ్మదేవుడు బహుప్రయత్న ముతో వస్తుపాలుడను నూతన కల్పవృక్షమును స్పష్టముగ సృజించెను".

వస్తుపాలుడు ఋణార్తుడగు నా కవికి ఋణమోక్షము కావించి కుటుంబ నియుక్తుడగు నాతనికి జీవితపర్యంతము యోగక్షేమములను గల్పించెను.

మహామాత్యులింకొకనాడు గురూపదేశ మాకర్ణించి సర్వత్ర ధర్మస్థానముల నిర్మించుట కుద్యమించిరి. సర్వో త్తమ తీర్థములందు, శత్రుంజయ పర్వతమందు, నందీశ్వ రేంద్రమండపమందు, రైవతాష్టాపదాదులందు, జలస్థల

పథములందు శుభంకరములు దివ్యములగు నారాసాదిదళ
ముల నిర్మించుటకు శాస్త్రకోవిదులగు సూత్రధారుల నేర్పర
చిరి. భూమండలమందు ధర్మహేతువునకు మంత్రులారంభిం
చిన కార్యములు చేయుటకు దేవతలు సైతము సమర్థులు
కాకుండిరి.

మంత్రులు నియమించిన కార్యకర్తలు ప్రతి గ్రామ
మందు కైలాసాచల సంకాశములగు జినప్రాసాదముల నిర్మిం
చిరి.ఆయా గ్రామపురాదులందు కల రాజభోగ ధనాదులతో
సూత్రధారులకు వృత్తులు కల్పించిరి. గ్రామసీమ లందలి
పన్నులతో దేవతలకుఁ గట్నము లేర్పఱచిరి. నాలయ
పార్శ్వములందుఁ బూజార్థము పూదోట లేర్పఱచిరి. జీర్ణము
లగు జినాలయముల నుద్ధరించిరి. ప్రతిచైత్యమునందు ఛత్ర
ములు, చామరములు,స్వర్ణతోరణములు, రత్నదర్పణములు,
శ్రీఖండద్రవము, ఘనపాత్రలు, ధాతుకుండికలు, ఆవాస
కుండికలు, మాంగళ్యదీపిక లేర్పఱచిరి. పూజలకు ముత్య
ములు, రథము లుత్సవముల కేర్పరచిరి. మంత్రులు పూజా
విఘ్నకారులగు దుష్టుల శిక్షించిరి. జినధర్మవేత్తలకు సంపద
లొసగి పోషించిరి. ప్రత్యాకరము, ప్రతిగ్రామము, పూజా
నిర్వాహాదులకు రాజముద్రిక లొసగి యసాధ్యములైన వానిని
గూడ సాధించిరి. దేశమందలి శ్వేతాంబర సాధువులకు
వస్త్రాదులొసగి ప్రత్యేకోత్సవముల గావించుచుండిరి. నిశ్శేష
దర్శనముల కౌచిత్యానుసారమర్చనలు జరిపించిరి. అర్హతుల
ఫాలములందు జాతిరత్నములు పొదిగిన బంగారు తిలకము

లుంచి యలంకరించిరి. జైన శాసనప్రకాశకులగు శ్రావకుల కుదార శృంగార ముద్రికలొసగిరి. శ్రీ ధవళక్కపురమండలి స్తంభనతీర్థమందు భక్తి యుక్తులతో సధర్మ్యులందు వాత్సల్యము నెరపిరి. రథయాత్రలు, తీర్థయాత్రలు జరిపి పాత్రులగు యాచకులకు దీనులకు మనోరథముల దీర్చుచున్నారు. పారమైశ్వర్యమగు విశ్వపావన శాసనమందు సర్వాత్మనా శక్తులను వినియోగించిరి.

మంత్రిసోదరు లొకనాటు గురువులవలన స్తంభనాధీశ శ్రీ పార్శ్వప్రతిమా ప్రభావము నాకర్ణించి ప్రయాణసన్నాహములఁ గావించుచు బూర్వోపకారులగు భట్ట సోమేశ్వరాదులకు భూములు, వస్త్రాలు, మండపములు నొసగి కృతజ్ఞతను వెలువరచుకొనిరి. సోమేశ్వర గురువు వారినిట్లు స్తుతించెను. "కృతజ్ఞుని గుణమును స్తుతించుట కెవరి వాక్కు ప్రయత్నింపదు? మేదిని గిరి, కూర్మ, మాతంగ, వరాహము లందు నిలువక వస్తుపాలు నాశ్రయించి సుఖించుచున్నది. దుర్గసింహుడు సూత్రములకు వృత్తి కావించెను. తేజఃపాల మంత్రీంద్రుడు విసూత్రములకు వృత్తికావించెను".

వస్తుపాలుడు రాజధానినుండి కుటుంబమును బిలిపించి స్తంభన తీర్థాదికులగు నగరవ్యవహారులు, సల్లెల వ్యాపారులు తోడురాగా జగజ్జీవాతు గుణసంపన్నుడగు తేజఃపాల సోదరునితోఁగూడి యుత్సాహ మినుమడింపగ రాజన్య కుమారులంగూడి హామానందమున కేగెను. వల్గత్తురంగమ వ్రాతముల గిట్టలవలన నెగసిన ధూళులు విమలములగు దిక్పాలక

గృహదీర్ఘికల మలినము కావించెను. శ్రీమత్పార్శ్వజినేంద్ర మందిరమున కేగి యశ్వాదుల నొసగి యాచకులకు, దీనులకు, నగతికులకు దానము లాచరించెను. మంత్రిసానంద హృదయముతో హేమమాణిక్య మౌక్తికము లాయాలమున కొసగెను. పంచాంగములతో, బంచథాభిగమము కావించి ప్రభువునకు రత్నమాల నొసగి పూజించి మ్రొక్కెను. శ్రీ పార్శ్వ పరమేశ్వరునితోఁబాటు సువివేకులగు శ్రీ సంఘ సభ్యులకు గాత్రపావిత్ర్య కారణమగు స్నానమును మంత్రులు విధివిధానమున గావింపజేసిరి. కొందరు పుష్పాంజలు లొసగిరి. మరికొందరు శ్రావకులకుఁ దిలకము లలంకరించిరి. కొందరు ధూప మొసగిరి. బంగారు పాత్రలతో జలము కొందరిచ్చిరి. కొందరు భక్తిభరమున జినేంద్రు నెదుట నర్తించిరి. ఉభయ సముశ్రేణులందున్న యస్మాతులు మంత్రుల ముందుంచుకొని దేవతలకుఁ బుష్పాంజలు లొసగి యభిషేకములు కావించి సూత్రపాఠములను బఠించిరి. దేవేంద్ర సదృశుడగు వస్తుపాలుడు సంఘమువారి బలవంతమునఁ దచ్చైత్యమున కధ్యక్షపదవి వహించెను.

అప్పుడచ్చటకు మల్లవాది మఠాధిపతి యనాహూతుడయ్యు వచ్చెను. అతడు తన్మహోత్సవము కావించి విస్మితుడై దేవస్నాన విధిని బరిశీలించి సమయోచిత విశదాచారము విస్మరించి "యసారమగు సంసారమందు సారంగ లోచనయే సార"మని పలికెను. ఆ సూరివాక్యములు విని యచ్చటివారందరు కటకటపడిరి. వస్తుపాలుడా మఠాధిపతి

ననాచార వంతులలో న|గగణ్యునిగ దలంచి యిట్లు తల పోసెను. "ఈత డస్వాతులందుండ దగినవాడు కాడు. అనాచారుల సన్మానము, సదాచారుల నిందనము ఘోరపాప కారణములు. ఇది భవమార్గపాథేయము. శ్రీ జినాగారమున శృంగార తరంగిత వాక్యములాడుటకు వీనికి నోరెట్లు వచ్చెను. వజ్రలేపోపమమార్జించెనే! మేరువువలె నిశ్చల శీలము కలవాడే సాధువు. ఇందరు సూరులిందుండ నీత డిట్లేల బల్కెను".

మల్లవాదిసూరి సూరిబృందమునందు గూర్చుండెను. మంత్రివర్యులు జ్యేష్ఠానుక్రమముగ సూరిపూజనము కావించి సంఘమువారితోగూడి దేవదేవుని స్తుతించి మంగళహారతు లొసగిరి. సర్వచైత్య సర్వసాధు సూరివందనము లాచరించిరి. మల్లవాదిసూరి యచ్చటి కధికారియగుట వలన నన్యసూరు లాతని నుపదేశింపగోరిరి. ఆతడు "నిస్సార సంసారమున సారంగలోచనయే సార"మను నంతలో విరక్త హృదయముతో వస్తుపాలు డాతనికి నమస్కరించి యావలకేగెను.

పోరువాడ వైశ్యకులాలంకారుడగు వస్తుపాలమంత్రి క్రమముగ సకల చైత్యముల కర్చనలు కావించి యిట్లష్ట దినములు పూజాదులు జరిపించెను. కలియుగమందు దన దానలీలను దెలియపరచుటకు యాచకుల నాహ్వానించెను. భట్ట సోమేశ్వరులవంటి ప్రసిద్ధ కవికుంజరులు వచ్చి మంత్రి సుత్రామగుణ కీర్తనమిట్లు కావించిరి. "శ్రీ వస్తుపాలా! నీ ఫాలమున జినశాసనము, ముఖమున వాణి, హృదయమున

గృప, కరపంకజమున లక్ష్మి, దేహమునఁ గాంతి ప్రకాశించుట చూచి కోపించినదో యన్నట్లు నీ కీర్తి బ్రహ్మలోకమున కేగెను. ఇంటిలోనుండి వెలుపలకురాని యితరుల కీర్తి కాంతలు కులటలనియు స్వైరచారిణియగు నీకీర్తి లతాంగి పతివ్రతయనియు నిరంకుశులగు కవులు వర్ణించుచున్నారు. ఓ వస్తుపాల మంత్రీశ్వరా! నీ దానములవలన గలిగిన కీర్తి సముద్రమే వస్త్రముగా ధరించి యంతటను పూర్ణోత్తరీయ పిహితావయవయై యిప్పటికిని గ్ణవికలయని తెలియకుండుట మిక్కిలి యద్భుతము. ఓ వస్తుపాలా! నీకీర్తి ముసలితనము వలె నెల్లర నాక్రమించుచున్నది. కర్ణశక్తిని దగ్గించి బలి స్వభావముతో శిరఃకంపమును కూర్చుచున్నది".

వస్తుపాలుడీ స్తుతులాకర్ణించి కవులకు, భట్టులకు వేల కొలది మందికిఁ బ్రత్యేకముగ లక్షలకొలది ద్రవ్యము లొసఁగెను. పడిపోనున్న, పడిపోయిన జినాలయముల నుద్ధరించుటకుఁ బదిమూర్ల దీనారము లొసఁగెను. దేవసేవకులకు క్షేత్ర గ్రామాకరారామ హేమాశ్వాదు లొసఁగెను. దేవాదాయముల స్థిరపరచెను. దురాచారుల శిక్షించు శాసనము గావించెను. మరల మరల జగన్నాథునకు మ్రొక్కి తన్మయీ భావముతో దేవాలయమునుండి యీవలకు వచ్చుచుండ ద్వారికడ్డముగ నిలచి మల్లవాదిసూరి యభినందింపగ విరక్తితో మంత్రినమస్కరించెను. మల్లవాది వస్తుపాలుని పాణిపద్మము స్పృశించుచు "దూరమునుండి చూడఁగాఁ గర్ణ రసాయనమైన తృష్ణ దగ్గరనుండియు మాకుఁ జల్లారకున్న"

దనెను. మంత్రి విస్మయమంది 'యితడేదో చెప్పదలచి యున్నా'డని తలచుచు నచ్చటనే నిలువబడి విస్మేరవదనుడై యాతనికి నమస్కరించి "యతిథులకు సజ్జనులు నమ్రత చూపించుటే ప్రథమాతిథ్యము. నీ వాఙ్మయాంభోధి యగాధ తరమైనది. ధీవరులుకూడ దాని పారమును గాంచజాల కున్నారు. కాని మీ భావము వివరింపు"డనెను. మల్లవాది పండితుడు మంత్రినిజూచుచు "మాకుఁ దొందరపనులున్నవి. మీరు వెళ్లుడు వెళ్లు"డన మంత్రి నవ్వు మొగముతోఁ జేతులు జోడించి "కవిరాజా! నాకా పద్యభావము తిరిగి వివరింపవలసిన"దని కోరెను. మంత్రి వినయమునకు మల్ల వాదిసూరి సంతోషించి ప్రీతియను నమృతమును వర్షించుచు శాంతస్వాంతముతో నిట్లనెను.

"మంత్రీంద్రా! సావధానముగ నాకర్ణింపుము. ఇచ్చటి కనతిదూరమున నొకదేశము కలదు. అందుఁ గుబ్జానామకు డొకడుండెను. ఒకనాడు వేలాకూల వాస్తవ్యు డొకడా ప్రాంతమునకు రాగా వాడాతని నెక్కడనుండి వచ్చితివని ప్రశ్నించెను. నేను సముద్రప్రాంత నివాసినని తెల్ప నతడు సముద్రమన నేమనెను. అతడు కుబ్జునితో 'సముద్ర మనం తము. అతడు నదులకు రాజ'నెను. కుబ్జుడు సముద్రమందేమి కలదో చెప్పగోరెను. అతడు సముద్రము నేమని వర్ణింపగలను? అందలి రాళ్లే రత్నములు. లక్ష్మీనారాయణు లందుందురు. ఇసుకలో ముత్యములు దొరకును. పగడము లుండును. దాని పేరే రత్నాకరమని చెప్పిపోయెను. కుబ్జుడు సముద్రమును

జూడఁగోరి విముగ్ధబుద్ధితో సర్వసంపదలు కరతల గతములని తలచి హుటాహుటినేగి సముద్రమును దర్శించి దప్పికచే నందలి యుప్పునీటి నధికముగ ద్రావి కడుపునొప్పితో బాధ పడుచు నా విదేశీయుడు మోసగించెనుగదా యని తలచి దప్పికతీర్చలేని సముద్రము వృథాయని నిందించి తన యింటికేగెను.

మంత్రీంద్రా! మనమిప్పు డామడ దేశీయునితో సదృశులమైతిమి. నీవు తీర్థసేవాకరుడవు. మేము స్తంభనకతీర్థాధికారులము. నానా శాస్త్రములు జదివి నానా లోకోక్తులు వినియున్నారము. సాధువులమై నిష్పాక్షిక బుద్ధితో, సమ్యగ్ధర్మగ్రహణ మొనరించి శీలముతో భవతరణ మొనరింప యత్నించుచున్నారము. ధవళక్కపురమున నీవు నిర్మించిన నానావిధ జినాధీశ ప్రాసాద ప్రముఖనిఖిల పుణ్యస్థానములను గూర్చి వింటిని. వీరధవళాధీశ్వరుని, నిన్ను, నీ తమ్ముని గూర్చి వీనులార వినియున్నాను. నీ దానము, బలము, బుద్ధి నా కామోదము కూర్చినది. నీ తమ్ముని శాసన మాడల దాల్పని వారెవరు? ఆతడు గుణవిటప ప్రరోహము. దాని నీడలు ముల్లోకముల నాక్రమించినవి. అందు శ్రీ సహాయముతై కీర్తులు వర్తించుచున్నవి.

ఓ మంత్రీశ్వరా! యిందువలన నాకు దివానిశములు నిన్నుజూడవలయునను నుత్కంఠ కలిగినది. నా పుణ్యయోగమున నొకప్పుడైన శ్రీ మత్పార్శ్వ జినదేవు నారాధించుటకు వస్తుపాలుడు రాగలడు. అప్పుడాతని యెదుట నా

నేర్చిన సూక్తుల దెల్పెదనని యువ్విళ్లూరుచుంటిని. కాంతుని వలనఁ గాంత, వినయమున విద్వాంసుడు, సన్మంత్రివలన రాజ్యము, సంపన్నుడగు పురుషునిగోష్ఠివలనఁ బురుషుడు గరిష్ఠప్రతిష్ఠ నందుచున్నారు. ఇన్నాళ్లకు నా కోరిక ఫలించి నట్లు నీవరుదెంచితివి. నేను నీయెదుట సుభాషితము తెల్పఁ బ్రారంభింపగనే వ్యర్థసందేహములతో విరక్తుడవైతివి. సూరుల నతిక్రమింపదలచితివేని యిందుండి వెడలుము. నా మనమందలి కోరికలు సమూలముగ నశించును గాక''

మంత్రీంద్రు డామల్లవాదిసూరి వాక్యములను విని తన యపరాధము క్షమింపుడని బహుధా ప్రార్థించెను. శ్రీ మంత్రీశ్వరుడు ప్రణయభావముతో శ్లోకవిషయము ప్రస్తావింప నదీనవాక్యుడగు మల్లవాది పండితు డానందముతో నిట్లు వక్కాణించెను. "నేను స్నాత్రోత్సవ దిదృక్షతో జినాగారమున కరుదెంచి నా యదృష్టమువలన నా కంటికుత్సవము కల్గించుచున్న మిమ్ము చూచి పారవశ్యముతో నర్హాత నమస్కార పాఠనముకూడ మఱచి జగన్మాన్యలగు సీమంతినులు స్తుతింపదగినవారు. వారు జగదుద్యోతనాగము పుత్రరత్నములఁ బ్రసవించియున్నారు. యుగాది దేవప్రముఖులగు జినేంద్రులు, సామంగలేయ ప్రముఖులగు నరేంద్రులు, కౌంతేయ, చంపాధిప, విక్రమార్క, శ్రీ ఆమరాజ, చాళుక్య నరేశ్వరాదులు జగజ్జనుల కోరికల దీర్ప నుదయించిరి.

"ఈ కలియుగమందు మీవంటి వారెందరో లేరు. ప్రాగ్వాటవంశ సూర్యుడగు నాభూమంత్రికి విశ్వశ్లాఘ్య గుణోదయయగు కుమారదేవియను తనయకలదు. త్రైలోక్య తిలకాయితులగు సుతులగన్న తల్లికి మేదినియు మూల్యము కాదు. మీరు జగత్పూజ్యులు. వినయవంతులు. దళితాపగులు. సజ్జనుల పుణ్యమువలన మీరిట్టి సంపన్నులైరి. దుష్కాలమను సముద్రమున జైనమతము క్రుంగిపోవ నుద్ధరింప నుదయించిన ప్రభామయ ప్రదీపములగు మీరు విశ్వ విశ్వశ్లాఘ్య గుణరత్నాకరులు, భూపవ్యాపార ధౌరేయులు. మీ రేతల్లి కుదయించిరో యను చింతా పరవశావేశమున నేనా యస్ఫుత లేశ్నమందు నా సగము శ్లోకము చదివితిని. మంత్రీంద్రా! ఇప్పుడా శ్లోకమందలి యుత్తరార్ధము వినుము. 'వస్తుపాలా! నీవంటివా రేతల్లి కుదయించిరో' ఇదో పూర్తి శ్లోకము వినుము.

"అసారేకిల సంసారే సారం సారంగలోచనా
యత్కుక్షిప్రభవా ఏతే వస్తుపాల! భవదృశాః

ఓ వస్తుపాలా! నీవంటి సజ్జను లేతల్లికుదయింతురో యీ నిస్సార సంసారమున నా తల్లియే సారమని నేను నిన్ను స్తుతించితిని. పరోపకార ప్రవణులగు నరులు సహజముగ నున్నారు. దుస్తర దుష్కార్యసమాలోకనులగు వారిని నెవరు చూచెదరు? సుధామధుర వచనములతో దుర్దైవదగ్ధమగు జగమును నానందింపజేయు వాడవునీవు! షాడ్గుణ్యవాచస్పతీ! నీవే

దర్శనీయుడవు? ఇంటికరుదెంచిన వారికి నీవు మానము నొసగి మానమొందుచున్నావు. కాని యాచకులకు మాన (వద్దు లేదు అనుమాట) మొసగకున్నావు. ఇది చాల చిత్రము".

మల్లవాదిసూరి వాక్యము లాకర్ణించి మంత్రి లజ్జా నమ్ర శిరస్కుడై యథోచితముగఁ బ్రణమిల్లి యాతనిని సాగనంపి యాచకుల కోరికల దీర్చి స్వజనసంయుతుడై నిజా వాసమున కేగి సంఘమున కనుపమ భక్తియుక్తుడై వాత్స ల్యము కావించి సారోదారములగు వస్తువు లర్పించి శ్రావకు లకు భోజనము కావింపజేసెను.

మంత్రీంద్రుడు భోజనానంతర మేకాంతమునందుండి కోశాగారాధ్యక్షుని బిలిపించి 'నీవు పదివేల బంగారు నాణె ములు గొంపోయి మఠమున కేగి జైనసూరి పదవీపరిశోభితుడగు మల్లవాది కవీంద్రునకు నా మాటగా గౌరవపూర్వకముగ నిచ్చి రావలసిన'దనెను. కోశాధికారి బంగారు నాణెముల గొనిపోయి మల్లవాది పండితునితో 'సుప్రసన్నుడగు మంత్రీ శ్వరుడు మీకీ హేమటంకముల బంపెను. గ్రహింపు'డనెను. మల్లవాది పండితు డాతనితో "మంత్రీశ్వరు డౌచిత్యాను సారము పంపియుండును కాని నాకు నీ ధనముతో బనియేమి? నీవు వెనుకకుఁ గొనిపొమ్మ"నగా నాతడు "మంత్రీశ్వరాజ్ఞ లేనిదే వీనిని గొనిపోరా"దని పలికి దాని నచ్చటనుంచి వెనుదిరిగిపోయెను. అతడు వెడలి మంత్రిని జేరునప్పటికి మల్లవాది శిష్యులతో నచ్చటకు వచ్చి మంత్రితో నిట్లనెను.

"మీరు దానవీరులలో నుత్తములు. జినాధీశ శాసన ప్రవర్తకులు. నేను వందిమాగధుడను భట్టును చారణుడను గాను. నేను మీ యశఃపాత్రుడను వయోచితుడనుగాను. సారాసార విచారవంతుడు జైను డెట్టివాడైనను పండిత శోషణీయుడు కాడు. విశ్వశ్లాఘ్యతావహ చారిత్ర రత్నము నొంది నిత్యసంతుష్టుడనైన నేను దీనునివలె ధనము గ్రహింపను. జైనులు దైన్యభాజనులుకారు. నా మనఃప్రమోదము వలన నిన్ను స్తుతించితినే కాని ధనాశవలన నుతింపలేదు. ఋషిమాత్రుడగు నాకు ధనగ్రహణ ముచితముకాదు. అర్హా తులగు మీరు నాయందు గ్రహింపలేను".

ఈ యనూచాన విషయమును దలచుచు వస్తుపాలుడు హాసన్ముఖుడై "యెట్లైనను మేమీ బంగారము గ్రహింపజాలము. మీకు నొసగినందువలన నిది గురు ద్రవ్యము. దేవతాద్రవ్యము, గురుద్రవ్యము విషసదృశము. సర్వ ధర్మకార్యములందు ధనము సాధారణమైనను సన్న్యాసుల కిచ్చిన ధనమెప్పుడుపయోగింపరాదు. సన్న్యాసిధనము చేగూర్చిన ధర్మస్థానము సజ్జనులకు త్యాజ్యము. ఈ బంగారముతో నేమి చేయుమందురో చెప్పుడు. ప్రమాణభూతులగు మీ వాక్యములు ప్రమాణములు కదా!" యని యనెను.

మల్లవాది పండితుడు మంత్రితో శ్రీ సంఘసహితులై మీరిప్పు డెచ్చటి కేగుచున్నా'రనెను. మంత్రి యాతనితో 'మేము భృగుకచ్ఛ మహాతీర్థమునకు దేవతలకు మ్రొక్కుటకు బోదలచితి'మన మల్లవాది పండితు డిట్లనెను. "ఈ

బంగారము నేను గ్రహింపను. దీనిని ధర్మకార్యార్థము వినియోగింపవలసినది. పుణ్యాకరమగు వ్యయోపాయము కలదు. మంత్రీశ్వరా! నాయీ సర్వసమ్మతవాక్యములను వినుము. భృగుక్షేత్రపురమందు తీర్థమందిరము కలదు. కుమారపాల భూపాలుని దండనాయకుడు మల్లికార్జున భూపాలుని జయించిన పరాక్రమవంతుడగు ఆమ్రదేవు డాతీర్థమందిరము నర్మదా నదీప్రవాహమున నశించుటచూచి సింధులాదేవి నోడించి కైలాసాచల సోదరమగు నవ్యప్రాసాదము నిర్మించి సువ్రతేశ్వరుని ప్రౌఢాలేప్యమయ మూర్తిని ప్రతిష్ఠింపజేసెను. శ్రీ సంఘీయులు స్నాత్రోత్సవమును జేయుటకు స్నాత్రప్రతిమ లేనందున ముంపునకు రారైరి. అందువలన నచ్చట నెవ్వరు పూజలు గావింపరైరి. నీవీ బంగారముతోఁ బ్రతిమను నిర్మించి స్నాత్రపదమున స్థాపింపుము. స్నాత్రోత్సవమును జరిపింపుము''.

మంత్రీశ్వరు డాయుక్తియుక్త వాక్యము లాలకించి శిష్యపురస్సరముగ శ్రీ మల్లవాదిసూరిని వస్త్రాదులతో సత్కరించి సాగనంపెను. పుణ్యాత్ముడగు వస్తుపాలు డయుత ద్రమ్మములతో దైవపూజ కేర్పాట్లు గావించెను. ఆ చైత్యము సమీపమున రెండు సత్రముల గట్టించెను. వానికి బంగారు కలశములుంచెను. వచ్చిపోవు ద్వారములందు ముత్యాల తోరణము లేర్పరచెను. బలిష్ఠమగు దుర్గమును నిర్మించెను. వాపీకూప ప్రపల నేర్పరచెను. శుద్ధ ధాతు రసాత్మకముగ అర్హత ప్రతిమను నిర్మించి శ్రీ జగచ్చంద్ర

సూరులచే భృగుక్షేత్ర తీర్థస్నాత్రపు పీఠమున బ్రతిష్ఠింప జేసెను. అందు జైనులకు బంగారు కలశములు ప్రతిమలు తోరణములు గల నలువది చైత్యముల గట్టించెను. వస్తు విచార విదుడగు వస్తుపాలమంత్రి శకుని విహారమను గజమువలన భవబంధముల భేదించుటకొఱకు నా విహార ప్రాంగణమున నా రాజసనీయాశ్మములతో నేనుగులంత రెండు దేవసర్పములను నిర్మింపజేసెను. ఆ గూఢమండపమందు నజిత, శాంతియను పేర్లుగల దేవతల జినుల పరికరములుగా గూర్చి తనకు, లలితాదేవికిఁ బుణ్యార్థము నిర్మింపించెను. దాని పార్శ్వమున లలితాదేవితోఁ గూడిన తన ప్రతిమను స్థాపింపజేసెను. తేజఃపాలుడు సువ్రతప్రభునకు ధాతుస్నాత్ర ప్రతిమ నేర్పఱచెను. అచ్చటి యశ్వావబోధ తీర్థమందు కాంచన నిర్మితములగు తీర్థేశప్రతిమలను, దేవనాగ ప్రతిమలను, నిరువదైదు దండములను తేజఃపాలుడు నిర్మింప జేసెను. అతడూరి వెలుపలఁ దాల, తమాలవంతమగు పూఁదోటను నాటించెను. వస్తుపాలమంత్రి వడఊనక పల్లెలోని చైత్యమున నాభేయనేమి మూర్తులఁ బ్రతిష్ఠించెను. కోటి ద్రమ్మములు వ్యయించి హేమబింబమును స్నాత్రపీఠమునఁ బ్రతిష్ఠించి యుద్దామోత్సవములతోఁ గలిదళనము, పాప మథనము కావించి పూర్వుల ప్రీతికొఱకు మాంగళ్యదీపము నేర్పరించెను. మంత్రీంద్రుడు తాపసులకు రేవానదీ తటమందైదులక్షలు, శుక్లతీర్థ తటమందు రెండు లక్షలు దానము లొసరించెను. అద్వయసంపన్నుడగు మంత్రి భృగుక్షేత్ర

పురమందు సత్రములు, తీర్థములు, అర్చనములు మొదలగు వానికిఁ గోటి ద్రమ్మములు వ్యయించి దర్భావతు దేశా లంకార భూతములగు తీర్థములకు మ్రొక్కి, దానములు గావించి సంఘజనానుగమ్యమానుడై మంత్రి రాజధానిని జేరెను.

పిదప మంత్రీశ్వరుడు రాజానుమతితో స్తంభనతీర్థము నకు వేలాకూలరాజ పరివృతుడై యేగెను. వారిచ్చిన కానుకలతో మంత్రులు పెక్కు ధర్మకార్యము లొనరించిరి. వస్తుపాలుడు స్తంభన తీర్థపురమందలి సాలిగ దేవరకు మంటపము నేర్పఱచి గర్భగృహద్వారమున నాత్మ ప్రతిమను, దేజఃపాల ప్రతిమను స్థాపింపజేసెను. వడదేవునకుఁ బుణ్యార్థము తత్పృష్ఠచైత్యములం దష్టతబింబములఁ బ్రతిష్ఠించెను. ఔసవాల పార్శ్వనాథ జినాలయమందు దాను దన ప్రతిమను దేజఃజాలుని ప్రతిమను స్థాపించెను. తనకు దేజఃపాలునకు బుణ్యార్థము నాదిదేవుని ప్రతిమను, దమ భార్యల పుణ్యము కోరి నాభి, సిద్ధార్థుల విగ్రహముల నేర్పరచెను. మోక్షపురద్వార తోరణ స్తంభ సన్నిభులగు నాభి సిద్ధార్థులను జైనులు మును గూఢమండపమందు శరీర త్యాగము గావించియుండిరి. ధారాపద్రక శాంతినాథ జినాలయమందు బలానకత్రయ గూఢమండపము నుద్ధరించెను. అచ్చట దన మేనత్తయగు కేళికాదేవికి, దమ పినతండ్రియగు తిహుణపాలునకు దనకు శ్రేయముకోరి క్రమముగ సంభవము, అభినందనము, సారిదలను పట్టశాలల నేర్పరచెను. శత్రుంజయ

ప్రథమాష్టాత సదనమున శ్రీ నేమి, పార్శ్వజినులకు దేవనాగములు నేర్పరచెను. ప్రాగ్వాటవైశ్య వంశోద్భవులును లలితాదేవి తండ్రియునగు కృష్ణదేవునకు, సౌఖ్యలతా జనకునకును రాణూశ్రేయముకోరి లలితా సౌఖ్యలతల పేర మధురా, సత్యపుర జినాలయములందు బలానకము, ఛత్రికలు, మంటపములు, పురఃప్రాంతరథ్య, వరండము, మఠము, అట్టము, జినబింబములు నేర్పరచెను. లలితాకాంతుడు ఉపాశ్రయముల వసతు లుద్ధరించెను. వీరనాథునకు గఢశాల, రెండట్టములు గల మఠము నిర్మించెను. పూర్వాద్రి గుహాయందుం బ్రకాశించు చంద్రునితో సాటివచ్చు చంద్రప్రభను నిర్మింపజేసెను. పల్లీపాలాఖ్య వంశీయుడు, శోభనదేవుని కుమారుడు, భాండశాలి, మహామనస్కుడగు నుదయసింహుడు సంగ్రామసింహ సంగ్రామోపశాంతికై తన శిరస్సును రణదేవతకు బలి కావించియున్నందున రోఘుడీ చైత్యమం దాతని మూర్తిని మంత్రీంద్రు డేర్పరచెను. అతని యాత్మశాంతి కొరక జినేంద్ర బింబమేర్పరచెను. రోఘుడీ చైత్యమందలి యాదినాథజినేంద్రునకు శక్రమండప మేర్పరచెను బ్రహ్మాణా, నేమినాథాలయమం దాదినాథ దేవునకు దేవనాగముల నేర్పరించెను. సండీరమల్లినాథ జినాలయమునం దన ప్రియురాలగు సౌఖ్యలతాదేవి పుణ్యముకోరి సీమంధర ప్రభువునకు దేవకులికలుగల మండపము నిర్మించెను. భావడాచార్య యుగంధర, బాహు, సుబాహు జినాధిపులుగల పార్శ్వనాథ జినేశ్వరునకు జినత్రయ ప్రాసాదము నేర్పరచెను. శ్రీ కుమార

విహారమందు మూలనాయకుని బ్రతిష్ఠించి యంగడివీధినొక దాని నేర్పరచెను. పౌత్రుడగు ప్రతాపసింహునకు నాతని చిన్నతమ్మునకు శ్రేయముకోరి యర్హత దేవనాగముల నిర్మింపించెను. వృషభప్రభునకుఁ దన తండ్రిపేరుతో నాసరాజ విహారమను ప్రాసాదము నేర్పరచెను. నేమినాథునకు దనతల్లి కుమారదేవి పేర కుమారదేవి విహారమును నిర్మించి తల్లిదండ్రుల పేరి ప్రాసాదములకు స్థండిలబంధము లేర్పరించెను. ఆ రెండిటి కొకే నిర్గమనద్వారము ప్రవేశద్వారము నేర్పరచెను. తన తండ్రియగు నశ్వరాజు పుణ్యముకోరి శత్రుంజయనగాజ్ఞయంత తీర్థసదృశమగు చైత్యము నిర్మించెను. అం దేఁబది జినాలయము లెనిమిది మంటపములు కలవు. ఆరాసనోత్తాన పట్టద్వారపత్రములు దానికిఁ గలవు. అందు ఘంటలు గల ధ్వజదండములు నూఱుకలవు. మూఁడు తోరణములు బొమ్మలతో నిండియున్నవి. ఏకాంత ధార్మికుడగు మంత్రి యాచైత్యమున కనుబంధముగ రెండంగడివీధులు, నాలుగు వరుసలిండ్లుగల వాటిక నేర్పరచెను. ఆ సారాజవిహారమందు శ్రియఃకారకమగు పిత్తల సమవసరణము కల్పించెను. చరిత్ర పవిత్రులగు మునులకై భవసముద్రమునకు నావల వంటి వైదు వసతుల నేర్పరచెను. స్వర్గవిమానములను గెల్చుచున్న పౌషధశాలికల సాధు నివాసములకు ఘటించెను. లోకోపకార శీలియగు నా మంత్రి బావులను, దోటలను, జలివేంద్రలను, కోనేళ్లను, వాటికలను, బ్రహ్మపురములను, శైవ మఠములను, శివాలయములను ఘటించెను. మహీసాగర

సంగమమందు తనకు శంఖునితో జరిగిన యుద్ధమున మరణిం
చిన భూణపాలాది వీరుల విక్రమ వ్యాపారకథలు లోక
ప్రశంసలందుటకు వారివారి పేర్లతో స్తంభనతీర్థ పురోప్రాంత
మహీతీరమందు దుర్జనకుల శ్రీ కారాగారములగు శివాలయ
ముల పదింటిని నిర్మింపించెను. బ్రహ్మపురముల నిర్మించెను.
అందు ద్విజరాజులు తుంగకుట్టిమముల విశ్రయించుచుందురు.
చతుర్దశ భువనములందు సంచరించు కీర్తిగల వస్తుపాలుడు
బ్రహ్మపురమందలి బ్రాహ్మణులకు బదమూడు వాడలు
కట్టించి యిచ్చెను. వారికి రామపల్లడికా గ్రామమును శాసన
పూర్వకముగ దానము కావించెను. అచ్చట పౌరుల యుప
యోగముకోరి కూపకైతవమునం బాతాళమునుండి యొక
సుధాకుండము నాహ్వానించెను. అచ్చటివారి కోరిక మేరకు
మంత్రి యాదవ కులభానుడు నంద తనయుడగు శ్రీ కృష్ణు
నకు నిందిరాన్వితమందిరము రాజసౌధోపమముగ నిర్మిం
పించెను. బంగారు కలశములు, ధ్వజదండములు, పతాక
ములు కల నూర్లకొలది జైనచైత్యము లేర్పరించెను. జల
స్థలమునుండి వచ్చిన వణిజుల విశ్రాంతికి రెండుమండపముల
కల్పించెను. పెరుగమ్ముటకు వేదిక లమరించెను. వస్తు
పాలుడా పురమున వెన్నను, మనుష్యుల నమ్ముట, దున్నలు
మొదలగు పశువుల హింసించుట మొదలగు పాపకార్యముల
నిషేధించెను. వీరధవళుని శ్రేయమున కచ్చట వైద్యనాథ
మందిర మండపము పునరుద్ధరించెను. శ్రీ భట్టాదిత్య దేవు
నకు స్వర్ణకిరీటము దేవాలయమందుత్తానపీఠ మేర్పరచెను.

భామేశాలయ శృంగమందు బంగారు కలశము, ధ్వజదండము నేర్పరచెను. స్వకులస్వామి దేవునకు రంగమంటపమును మనోరంగోత్సంగ నర్తితభక్తితో మంత్రికూర్చెను. తేజఃపాల మంత్రి తల్లిశ్రేయముకోరి యచ్చట నరిష్టనేమీశ్వర ప్రతిమ నేర్పరచెను. శ్రీ చౌళుక్యరాజులు నిర్మించిన ఋషభస్వామి చైత్యమందు దండ సమన్విత సువర్ణ కుంభములు విరచించెను. వాడవేశ తీర్థమందు శ్రీ నేమి పార్శ్వ ప్రభువులకు దేవనాగములు, బలానకములు, ధాతుబింబములను గల్పించెను. శ్రీమదామ నరేంద్ర చైత్యమందు దివ్యాశ్మ తోరణము కషపట్టమయబింబము నేమి నాథునకు విరచించెను. వస్తుపాలుడచ్చట పెక్కు సత్రముల నిర్మించెను. దీనులు, విపన్నులగు వణిజులకుఁ గప్పము తొలగించి ఋణమోక్షము కల్పించెను. చౌళుక్య మంత్రిపుంగవుడు జీవరక్షావిధానమున నిరువది నాల్గు గవ్యూతుల క్షేత్రము పవిత్రీకరించుచు నందలిపౌరులు చౌళుక్య నృపైశ్వర్యరీతి స్మరించు నట్లొనర్చెను. వస్తుపాలుని పుత్రుడు జైత్రసింహుడు కావీ పురమందు కాంచనకుంభ యుక్తముగఁ బుండరీకావతార చైత్యము నిర్మించెను.

శంకరస్వామి రాజతుల్యుడగు వస్తుపాలుని గుణముల నిట్లు స్తుతించెను. "పరుల గుణముల గ్రహించినవానిని గుణి యందురు. అర్థులకు సంపదలొసగిన వస్తుపాలుని శ్రీమంతుడనుట విచిత్రముగ నున్నది. మిక్కిలి కార్పణ్యముతో దాచిన ధనము రెండులోకములకు గొరకాక యితరులకు

జెందును. ఈ మంత్రీశ్వరుడు పాత్రులకు సంపదల నొసగి మరియొక జన్మమందును దనను సంపన్నుని గావించుకొనుచున్నాడు''.

వస్తుపాలు డాశంకరస్వామి కేనుగులు, వర్షాసనములు, దీనారాష్ట సహస్రములు, వేగవంతములగు నశ్వములు సమర్పించి కవీంద్ర కల్పతరువను బిరుదము నొందెను.

ఇట్లు మంత్రి స్తంభనతీర్థమందు జినేశమందిరములు, ధర్మశాలలు అప్తాతుల యర్చాశాలలు, సంఘశాలలు నేర్పరచి కవీంద్రులకుఁ బుణ్యాత్ముల కభీష్టదానములొసగి నృపవందితుడై లోకులకు హర్షప్రకర్ష మొనరించుచు సద్వివేకవ్యయమున నైదుకోట్ల ద్రమ్మముల సాఫల్యము కావించెను.



శ్రీమంతుడు పద్మాకరమువలె సదాళిప్రీతికారకుడగు వస్తుపాలుడొకనాటి యుదయమున నిద్రలేచి రత్నదర్పణమందుఁ దన ముఖము చూచుకొనుచు దన చెవి ప్రక్కన నరసిన వెంట్రుక నొకదానిని జూచి యాత్మవిమర్శన మిట్లు కావించుకొనెను. "ఒక కళయు నభ్యసింపనైతిని. కొంచెమైన దపము సేయనయితిని. అర్థులకు నించుకైన దానము లొనరింపకుంటిని కాని – మధురమగు వయస్సు మాత్రము గతించినది. నూర్యుని రాకపోకలచే జీవితకాలము వ్యయమగు

చున్నది. పనుల కలిమిచే గడచిపోవు కాలము తెలియజాల కున్నాము. జరావ్యాధి మరణములు వెరపించుచున్నవి. అజ్ఞానమద్య మున్మత్తప్రాయము నొనరించు చున్నది. ఆయువు, యౌవనము, విత్తము, స్మృతి మొదలగువాని యందున్న మనస్సు పరలోక విషయములందు మొదటినుండి యుంచుకొన్నవానికి బరమ పదము దూరముకాదు. దినదిన మాయువు నశించుచుండ జీవికిఁ గుశలమెక్కడిది".

వస్తుపాలు డీరీతిఁ జింతించి లెస్సగ ధర్మకార్యములు సేయదలచి బంధువులతో బాటు ధర్మశాలకరిగి నరచంద్ర గురువులకు జీవుని వేదనమును దెలియబఱచుకొనెను. వారు మంత్రి నోదార్చి ధర్మశీల తపోభిరామమగు నాదేశనము కావించి "సామాన్యుడగు పూరణశ్రేష్ఠి భూతదయాపరుడై సాధువులకన్న దానము కావించుచు సంపదలు తటిచ్ఛంచల ములని యెఱిగి తపముకావించి చమరేంద్రుఁడను దేవుడైనాడు. ఆ చమరస్వామి దేవేంద్రుని వెఱపించినవాఁడు. జిననాథుడు చమరస్వామికి దేవనాథునకు సఖ్యముకూర్చె"నని భక్తుల చరిత్ర లుదాహరించిరి. వస్తుపాలుడీ గురూపదేశ మాలించి గృహస్థధర్మమగు సమ్యక్త్వరత్నము పరిగ్రహించెను.

ఒకనాడు మంత్రీశ్వరుడు దేశదేశముల నుండి శ్రీ సంఘమువారి నాహ్వానించి వాత్సల్యము ప్రదర్శించెను. మంత్రి వచ్చిన సంఘీయుల పాదపద్మములు కడిగి లోక మాలిన్యమును బోద్రోలెను. వారికి గోర్వెచ్చని నీటితో స్నానములు కావింపజేసి శ్రీ ఖండద్రవ పుష్పాదులతో

నలంకారము లొనరించెను. జినేంద్ర పూజాసురభియు, సుకృత్య ప్రకాశకుడు, శీల పవిత్రితుడు, వృషభాన్నతుడు, సకల సన్మంగళ గుణాభిరాముడు, శ్రీనివాసుడగు మంత్రి చూటమేర కర్తృతుల శాసనములు కల్పింపబడెను. సత్యేంద్రి యులగు సంఘీయులు సుఖాసీనులైరి. వారికి భాజనముల నుంచి కరపంకజములఁ గడిగించెను. సలీలగామిను లగు లలితాపతి పాత్రలందు ఫలములు సమర్పింప నర్హులు భుజించి తృప్తి నొందిరి. పిదప వారిపాత్రలందు ఖాద్యములు మోదకములు, పంచవిధ పక్వాన్న భోజనములు వడ్డించిరి. జైన భార్యలను లుపయోగించి నందున పాయసము ముల్లోకములవారికి బర మాన్నమాయెను. ఆజ్యములు, సూపబములు, శాకములు, మండకములు భుజించి శర్కరాపూర్ణ జలములాని సంఘీ యులు సంతసించిరి. మంత్రీశ్వరుడు తాలవృంతములతో వీచుచుఁ దన పాపముల బాపఁ జొలెను. తేజఃపాలుడు దధి పూరిత పాత్రలొసగెను. సాముద్రలవణము వారికొసగెను. వారరిష్టములాని తుచులైరి. పూగీఫల నాగవల్లీదళము లొస గెను. వస్తుపాలుడు గృహస్థాశ్రమ తరువును సఫలమొనరించి సంఘీయులకు దుకూలములు, సౌవర్ణమాణిక్య తిలకములు గూర్చి పులకాంకితుల గావించెను.

ఇంతలో నొక కవి విపశ్చిత్సూరి మండితసమాజమున నిట్లు వస్తుపాల స్తుతి గావించెను. "వస్తుపాల మంత్రీశ్వరు నకుఁ బర్వలోకముకొలకు సంతతి, వివేకముకొలకు సరస్వతి,

పరోపకారమునకు సంపద కలిగెను". తత్వ్రత్రయ పవిత్రుడగు మంత్రి కవికి మూడు లక్షల ద్రమ్మముల సన్మానించెను.

ఆదర్శనిర్మలుడగు మంత్రి మార్గైకవిమలగు పండితు లతో నాలోచించి సమ్యక్త్వవర్ణికను సజ్జనులకు సాక్షాత్క రించుటకు మహేంద్ర స్పృహణీయముగ నుద్యాపనము కావించెను. గోధుమరాశిపాలచే స్వచ్ఛముకావించి శర్కరా పూరితముగ మోదకము లొనరించి వానిని ప్రతి గ్రామపుర ములకు బంపించెను. అర్హులను సాధువులను లెస్సగ బూజించెను.

ఒకనాడు రాజు వీరధవళుడు కొలువుతీరియుండఁ దేజఃపాలయుతుడగు వస్తుపాలుడు నమస్కరించి "దేవా! ఘుర్జరదేశమెల్ల నీ యేలుబడిలోనిదాయెను. రాష్ట్రాంతర రాజులు నీ సామంతులు. దానము, ధర్మము, రణము, మానము, శస్త్రము, శాస్త్రములలో నీ సాటి వాడింకొకడు లేడు. నీ ప్రతాపమున జనులు స్వచక్ర పరచక్ర భయవర్జి తులై యున్నారు. రాజ్యమున న్యాయధర్మము లన్యోన్యము బంధకములుకాక సజ్జనసమ్మతములై యున్నవి. దనుజత్రస్తు లగు దేవతలు నారాయణు నాశ్రయించినట్లు పదచ్యుతులగు రాజులు నిన్నాశ్రయించి సుఖమందుచున్నారు. ఇట్టిమీకు మహాభిషేకోత్సవము కావింపగోరుచున్నాము మీరనుమ తింపవలసిన"దని ప్రార్థించెను.

వీరధవళ మహారాజు వస్తుపాలు నమృతసేచనముల వంటి వాక్యములు విని "స్వామిభక్తి, కృతజ్ఞత, సౌజన్యము, ఆర్జవముగల మీఁకు నాయందలి ప్రీతితో నిట్లు పల్కుచుంటిరి. నాకెట్టి మహిమములేదు. రాజ్యముల గెల్చితినా? యాగముల జేసితినా? ఏకచ్ఛత్రాధిపత్య మందితినా? ప్రజ్ఞలేని మంత్రి, శీలములేని యతి, త్యాగ విక్రమములులేని రాజు ప్రకాశింప జాలరు. కొందరు ధన్యులు లోకముల నిర్మించిరి. మరికొందఱు భరించిరి. ఇంకఁ గొందఱు నరులకొసగిరి. పదునాల్గు లోకముల నెందరో యనుభవించిరి. కొద్దిపట్టణములమీఁది యధికారమున నేనేల గర్వింపవలయు" నని యుక్తియుక్త వాక్యములతో నభిషేక సన్నాహము లొనర్చ మంత్రులను నిషేధించెను. సభ్యులు రాజు నిరహంకారితకు మెచ్చిరి.

ఇంకొకనాఁడు వాఙ్మయాంభోధి పారదృశ్వుఁడగు వస్తుపాలుఁడు ప్రస్తావోచితముగ మద్యమాంస పరిహారక పుణ్యాఖ్యానముల బోధింప నతఁడు మాంసభోజనము, సురాపానము, వేట, పర్వనిశలం దశనముమాని పరాంగనా పరిష్వంగ వైముఖ్యమునూని యుండెను.

మరియొకనాఁడు దేవతాకారముగల కవిరాజరుదెంచెను. మంత్రి 'మీరెక్కడనుండి వచ్చుచున్నా'రని ప్రశ్నించెను. అతఁడు 'నేను దేవాంగనా సంగీతములచే నీ యౌదార్యాదిగుణముల నింద్రసభలోవిని నిన్నెఱిగి నిన్నుజూడవచ్చితి' ననెను. మంత్రి కవిని దేవరాజ సభావార్తల దెల్పఁగోరెను.

అప్పుడాతడు నందనవనపాలకునకు దేవేంద్రునకు జరిగిన సంభాషణ మిట్లు తెల్పెను.

"వనపాలకుడు:-దేవ! దేవేంద్రా! గొప్పకష్టముకలిగినది.

ఇంద్రుడు:-నీవెవరవోయి!

వనపాలకుడు:-నేను నందనోద్యాన వనపాలకుడను.

ఇంద్రుడు:-ఏమి నీ దిగులు?

వనపాలకుడు:-అయ్యో! కల్పవృక్షమెవరో యపహరించిరి.

ఇంద్రుడు:-అట్లనకుము. మానవులందలి దయతో నేనే దానిని వస్తుపాల వ్యాజమున భూలోకమునకు పంపించితిని".

మంత్రీశ్వరుడు నూత్నమగు స్తుతివిధానము మెచ్చి కవి కేబదివేల దీనారము లొసగెను.

ఒకనాడు బ్రహ్మముహూర్తమున వస్తుపాలుడు నిద్ర మేల్కాంచి సర్వాభీష్టార్థ కారణమగు పంచనమస్కార పూర్వకధ్యాన మాచరించి వివేకవిమలాశయుడై క్షణ మవధాన మూని యిట్లు చింతించెను. "నేను వాసవోపమ సంపద లందినను ధర్మసంపదల నిప్పుడు విశేషప్రయత్నమున నార్జింపవలయును. ధర్మము సూర్యునివలె దమోపహారకము. కల్పవృక్షమువలె గోర్కెలదీర్చును. అన్యాయసంపదలచే ధర్మమాచరించువాడు ధూర్తధురంధరుడు. సంపదలుండియు ధర్మము లొనరింపకున్నంతటి హైన్య మింకొకటిలేదు. గాన నేనిపుడు తీర్థయాత్ర లొనరింతును. దానికిది తగిన సమయము. వీరధవళుని వంటి స్వామి దొరుకడు. తేజఃపాలుడు ప్రధాని ముఖ్యుడు. అనుపమ యింటికి సాక్షాల్లక్ష్మి. రాజ్య

భారము భరించువారెందరో కలరు. కాన నేనీ కాలమందే పుణ్య తీర్థయాత్రలు కావింపవలయును".

వస్తుపాలుడిట్లు చింతించి శుచియై దేవార్చనాదులు కావించి సభకు వచ్చెను. ఒక శ్రావకుడువచ్చి లేఖనందియ దాని నిట్లు చదివించెను. "పీలుపద్రజైన ప్రాసాదమునుండి శ్రీ నాగేంద్ర గణస్వామియు, కులక్రమాగత గురువగు విజయసేనుడు తేజఃపాల వస్తుపాల మంత్రుల నాశీర్వదించి వ్రాయు శుభలేఖాంశములు——తమ్మిని జేరిన శుమ్మోదవలెఁ బ్రజల బాధింపక ధనకోశము పూరింపుము. నీ స్తుతియను దివసము ప్రీతి గల్గించును. ప్రతాపముకల నిన్ను దోషము లను ధ్వాంతము లెట్లు చేరగలవు. మంత్రీంద్రా! 1277 నుండి నేటికి జరిగిన యిరువదిరెండేండ్ల నుండియు శత్రుంజయ రైవత తీర్థయాత్రలకు బోవువారు లేనందున నా మార్గములు దుర్గ ములై తృణతోయాన్నములు లభింపకున్నవి. నీవు సంక్షేప యాత్రకావించితివి. ఆదిశేషుడు, ఇంద్రుడు, భరతుడు, కుమారపాలుడు, వాగ్భటుడు మొదలగు వారీ యాత్రలు గావించిరి. ఆభూశ్రేష్ఠి రెండుమార్లీయాత్ర లొనరించి తొమ్మిను వందల జైనాలయముల నిర్మించెను. ఈ సందర్భమం దతడు యాచకుల కెనిమిదికోట్ల ధనమిచ్చెను. హేమచంద్రసూరి వరోపదేశమున కుమారపాలభూపాలుడు శ్రీసంఘముతోగూడి యాత్రలు కావించెను. నీవు సంఘాధిపత్యమొంది తీర్థయాత్ర కావించి మహామాత్య పదవివలన గలిగిన సంపదలను భవతా రణమున సార్థకము కావింపుము".

వస్తుపాలుడీ యాశీర్వాద లేఖార్థము విని యా శ్రావకుని భూరి దానములచే దృప్తునికావించి శుభాశయము భక్తి గర్భితమగు విజ్ఞప్తినొసగి శ్రావకుని సాగనంపెను. మంత్రీశ్వరుడు భక్తిసింధుడగు తేజఃపాల సోదరునిచే యాత్రా సామగ్రీ సన్నాహములు కావించి ధర్మశాల కరుదెంచి నరచంద్ర గురువులకు మ్రొక్కి "దేవా! నా మనస్సునందలి ధర్మచింత నిర్విఘ్నముగా కొనసాగింపగలదా?"యని ప్రశ్నించెను. నిమిత్తవేత్తలలో ముఖ్యులగు నా గురువు లాతనితో 'మంత్రీశ్వరా! నీ హృదయమందుఁ దీర్ఘయాత్రా మనోరథము కలదు. ఆ కోరిక కల్పద్రుమమై వీతవిఘ్నమై ఫలింపగలదు. అది సర్వలోకాభీష్టార్థ సిద్ధులొసగగలదు. నీ భాగ్యభరాంకురప్రౌఢిచే నీకీ తీర్థయాత్రాభిలాష కలిగినది".

## ౬

మంత్రీశ్వరుడు వారి వాక్యము లాలకించి వారివలన నా రెండు తీర్థయాత్రల మహిమ, విధానము విని వారితో "మీరు దేవాలయములందు వాసారోపము చేయు"డని కోరెను. వారాతనితో "దీనిని మీ గురువులే చేయవలయును. నాగేంద్రగణాధీశులగు విజయసేన సూరులు మీ కులక్రమాగత గురువులు. వారు మీ తల్లివంకవారు. నీవు వారి నాహ్వానింపవలసిన"దనిరి. సోదరయుతులగు మంత్రి

వారికి నమస్కరించి "మేమిరువురము మీ సన్నిధియం దావశ్యకములగు విద్యలనేర్చితిమి. మీరే గురువులు. మీరే యీ కార్యము చేయు"డని ప్రబతిమాలెను. వారాతనితో మేమట్లు చేయరాదు. మీ మాతృపక్ష గురువులు బాధ నొందుదురు. నీవు వారిని సగౌరవముగ నాహ్వానింపుము. సద్గురుసమ్మేళనము పుణ్యదాయక"మని ప్రబోధింప మంత్రి యంగీకరించి యాత్రా ప్రస్థానలగ్నము నిర్ణయింపజేసి వారికి మ్రొక్కి యింటికిబోయెను.

విజయసేన గురువులు మంత్రుల యాహ్వాన మంగీకరించి బయలుదేరి వచ్చిరి. వస్తుపాలు ఘనఘనధ్వని విన్న నెమలి వలె సంతసించి తనవారితో గూడి వారి నెదుర్కొని నగరములోనికిఁ గొనివచ్చెను. ఆ గురువులు మాణిక్య కలశములుగల దేవాలయములందు వాసారోపము కావించిరి. తీర్థయాత్రా మహోత్సవ ముహూర్తము సమీపింపగనే మంత్రులు తాము నిర్మింపజేసిన శత్రుంజయావతార చైత్యమందు మజ్జనోత్సవము కావించిరి. అర్థుల కోర్కెలు తీర్చిరి. గీతములు, నృత్యములు సాగెను. మహాధ్వజ మహాపూజా విధానములు జరిగెను. రాజును గౌరవించిరి. శీలశాలురకు విశుద్ధాన్నపానాదు లొసగిరి. యాత్రా మహోత్సవ సమయమరుదెంచెను.

వస్తుపాల మంత్రి ప్రయాణకార్యప్రవణులగు ప్రజలందరకుఁ బాథేయము, వాహనములు, పాత్రలు, పాదరక్షలు సమర్పించెను. వస్తుపాలు డాదరమున దూరదేశమందున్న

సాధువుల నాహ్వానించెను. అతనికీర్తి యొకదిక్కునుండి మరి యొక దిక్కున కరిగెను. సోదరులు సంఘాధిప పదైశ్వర్య మహోత్సవము కావింపదలచి యెల్లర నాహ్వానించిరి. చౌళుక్య రాజంతఃపుర సమేతముగ నరుదెంచెను. నాగేంద్ర గురువు లరుదెంచిరి. సకల నగరపురాధికారులు, శ్రేష్ఠులు, సామంతులు, సంఘాధిపతులు వచ్చిరి. పటహములు మ్రోగినవి. వణిజు లంగడులందు బంచవర్ణ ధ్వజములు ప్రతిష్ఠించిరి. గృహద్వార ప్రతోళిక లున్నత కేతువులతో స్వర్గవిమానము వలె నుండెను.

నాటి యుదయమున వీరధవళస్వామి విష్టరమందు మంత్రిసోదరుల వసింపజేసి యర్థేందు సుందరములగు వారి లలాటమందు కుసుమాక్షతలతోc దీర్ఘకృత్యపదప్రాప్తి కలిగించు సంఘాధ్యక్ష సూచక తిలకముదిద్దెను. వారిమెడలందు బూదండలువైచి హేమచ్ఛత్రము లిచ్చెను. చతురంగ సైన్యములు ప్రసాదించెను. సామంతులు కానుక లొసగిరి. జయ! జీవ! చిరంజీవ! సంఘభారధురంధర! యని సంఘీయులు, సాధువు లభినందించిరి. భట్ట సోమేశ్వరుడు తిలకము లలదెను. "మంత్రుల పాదములు తీర్థముల కేగుట కుత్సహించును. చేతులు దారిద్ర్యము తొలగించును. భుజములు రాజుల గెల్చును. కంఠములు ప్రియముల బల్కును, ఫాలములు సంఘాధ్యక్షత సూచించును. చూపులు మంగళప్రదము"లని నాగేంద్ర గురువులాశీర్వదించిరి.

మంత్రీశ్వరుడు సంఘాధిప సూచన తిలకములనిత రాప్తాళులకు దాను స్వయముగ దిద్దెను. మునీంద్రులకు వస్త్రము లొసగెను. సమర్థులు వ్యయము భరింపగలవారికి మహాధరపద మొసగెను. తమ రాజునకు రత్నాలంకరణము లొసగెను. రాజుల కందరకు హారములు, కేయూరములు, రత్న మాణిక్య ముద్రిక లొసగెను. సంఘేశ్వరులకు బంచవర్ణ దుకూలము లొసగెను. కవులకు రత్నమాణిక్య శృంగార వాజిగజాదు లొసగెను. మస్మృణాఘుస్మృణ పంకము లలది యీతడు దరిద్రుడగునని యున్న బ్రహ్మవ్రాతను జెరిపి యతనికి సువర్ణశ్రేణి మణిభూషలొదవుట నిశ్చయమని యలంకరించెను. జంగమ కల్పతరువువలె యాచకుల నర్థ ప్రదానమున గౌరవించెను.

ఇంతలో వీరధవళుడు ప్రేరేపింపఁ గవులు వర్ణనీయ మగు గుణాకరుడగు మంత్రినిట్లు వర్ణించిరి. హరిహరుడిట్లు స్తుతించెను. "భూలోకలక్ష్మీపతియగు వీరధవళుడు ధన్యుడు. ఆయనకు తీవ్రోష్ణసుధా కిరణములుగల సూర్యచంద్రులతో సమానులగు మంత్రులు కన్నులవలెనున్నారు. ఓ వస్తుపాలా! జన్మారంభమునుండి సుకృతస్తోమము వశ్యమైయున్న నీయందు నేను ప్రయత్న పూర్వకముగ దోషారోపణము కావించుచున్నాను. కల్పద్రుమపల్లవద్యుతిని దిరస్కరించిన నీ హస్తము కల్పతరువును ధిక్కరించుచున్నది. నీయీ దోష మెవ్వరెరుగ గలరు?"

దామోదరు డిట్లు నుతించెను. "ఉదయన మంత్రి కుమారుని మరణానంతరము నేటిరాజుల ద్వారములందు సంపద హరింపబడి యది నేటికి వస్తుపాలునిచేరి యాచకు లకు జెందుచున్నది".

మదన మహాకవి యిట్లనెను "రాజ్యలాలనమున, బం డిత పాలనమున వస్తుపాలుని మతి నిరాలస్యరీతి కల్గియున్నది"

భట్ట సోమేశ్వరు డిట్లనెను. "శ్రీ వస్తుపాలుని వలన కోటీరములు, కట్టకములు, అంగుళీయములు, తిలకములు, కేయూరములు, హారములు పట్టుబట్టల నొందిన పండితుడు వాని నలంకరించుకొని యింటికిరాగా వానిని భార్య సైతము గుర్తింపలేక పోయెను. ఆతడామెకు బెక్కు గుర్తులు తెల్పి శపథములుచేసి యెట్టకేలకు నమ్మించెను".

దానరాధేయుడగు వస్తుపాలమంత్రి రాజానుమతితో వారికి ప్రత్యేకముగ లక్ష ద్రమ్మము లొసగెను. సాధుశిరో మణియగు మంత్రి నిద్రాముద్రావశులై తలలు కదలించు చున్న యమరచంద్ర కవీశ్వరులజూచి "మీరు యోగవేత్త లయ్యు రాజాధిరాజులున్న సభలో నిట్లు తూగుచుండ దగునా" యని ప్రబోధింప వారిట్లనిరి. 'మంత్రీంద్రా! యోగులెన్నడును నిద్రింపరు. మేము లక్ష్మీనారాయణుల సల్లాపము లాకర్ణించుచున్నాము.

"విష్ణువు:-ప్రేయసీ! లక్ష్మీ! నీ ముఖముకాంతి తఱిగి యున్న దేల?

లక్ష్మి:-వైకుంఠ! ఏమతి కుంఠితమాయెనే? సంఘమువారి రాకవలన లేచినధూళి నా తండ్రియగు సముద్రునకుఁ గల్గు చున్న యాపద నెఱుగకున్నావే?

విష్ణువు:-ఓసీ పిఱికిదానా! భయపడకుము. గభీరుడగు నీ తండ్రి చిరకాలము సుఖించునుగాక! లలితాపతియు, సంఘాధిపతియునగు వస్తుపాలుఁడు వీరధవళుని కర్తుల నినుమడింప జేయునుగాక!'' వస్తుపాలుఁడు వారొనర్చిన యద్భుతవర్ణన మాలించి ప్రీతితో వారినిఁ గవులందరిముందు సింహాసనమున నుంచి వారి యానందమునకై స్తంభనతీర్థ పురమున శ్రీ వాటికమను నూత్న చైత్యము నిర్మింపజేసి యందుఁ బదు నాల్గు దేవనాగములఁ జిత్రింపజేసెను.

వీరధవళుఁడు మంత్రిసోదరులను "రాజ్యస్థితి కానుకూల్యముగఁ గుమారపాలుఁడు యాత్రకావించినట్లు మీరీ యాత్ర కావింపు''డని దీవించి సాంతఃపురముగ గృహమున కేగెను.

వస్తుపాలుఁడు యాత్రకు రాఁదలఁచినవారి కందఱకు వాహనాసన, పాథేయ, పరిచారక, ధనాదులిత్తునని నానా గ్రామపురాదులందుఁ జాటింపించి ముహూర్తసమయమున మూఁడు గొడుగులు దాల్చినదియు, బుణ్యసంపన్నిలయము, పంచవర్ణ ధ్వజాలంకృతమగు జినాలయమున కేగెను. పటహ ధ్వనులు ముల్లోకముల వ్యాపించెను. కుంకుమ జలముతోఁ గలయంపి చల్లి శ్రద్ధతోఁ బూజించుచుండిరి.

విశుద్ధములగు పితృమాతృ పక్షములు గల నలువురు కన్యలు రూపొందిన ధర్మలక్ష్ములనలెఁ బ్రతిక్షణము కంకణ మేఖలలు ధ్వనింప వింజామరలు వీచుచుండ వస్తుపాలుడా డేనుగుమీద నెక్కి, యుదార శృంగారవతులై రథమెక్కిన యువతులు ధవళ మంగళము లొసగుచుండ శాస్త్రవిధిగాఁ బరివారము, సంఘముతోఁగూడి తరలి సిద్ధిసూచకములగు శకునముల కానందించుచుఁ బ్రయాణము సాగించెను. సోమ సింహాది రాజులు నలువురు రక్షకులై ముప్పది రెండాయుధ ములతోఁ బోరగల నాలుగు వేల యాశ్వికులతోఁగూడి బయలు దేరిరి. ఎనిమిదిమంది మహాత్ములు తెనిమిది గజము లధిరో హించి దిక్పతులవలె సాగివచ్చిరి. మంత్రీశ్వరుని లేకపు వేలకొలది యంగడులు పెట్టింపవలసిన వస్తువుల యాత్రికులు స్వేచ్ఛగఁ గైకొనిరి. లక్షలకొలది శ్రావకులు, సంఘాధి పతులు వెంట బయలుదేరిరి. ఇరువది నాల్గు దంతమయ రథములు, కాష్ఠనిర్మితములగు రెండు వేల రథములు సాగి పోయినవి. పదునెన్మిది వందలమంది రథికులు చనిరి. తమ తలలమీది గొడుగులు చంద్రులవలెఁ బ్రకాశింప సంఘాధి పతులు మహేశ్వరులవలెఁ బ్రకాశించిరి. పందొమ్మిదివందల సంఘసభ్యులు ముప్పదెన్మిది వందలమంది చామరములు వీచుచుండ సుఖప్రయాణము కావించిరి. నాలుగు వేల యైదు వందల పల్లకులు, పదునెన్మిదివందల సైన్యములకు సుఖాసన ములు, రెండు లక్షలమంది ఋషులు, లక్షమంది దిగంబర సాధువులు, నాలుగువందల యష్టాంగములు, ముప్పదిమూడు

పందల రథములు, రత్నాలంకృతు లేడులక్షల మానవులు, తొమ్మిదివందల మాగధులు, నాలుగువేల గుఱ్ఱములుగల వస్తుపాలుని యాత్ర యానందకారియాయెను. అర్హతులకు నేకస్తంభ గృహాకారములు, చతురస్రములు, ఘనోన్నతములగు పటకుటీరములు వేలకొలది గలవు. లావు గుడ్డలు గల పటకుటీరము లేడువేలుకలవు. అంతట నిరువదైదువేల పటకుటీరములు కలవు. వస్తుపాలుని పటకుటీరము పంచవర్ణ చారుదుకూలరమ్యము. దాని పైభాగమున మాణిక్యములు పొదిగిన బంగారు కలశము కలదు. ఆ పటకుటీర ప్రాంగణమందు యాచకుల కొసగిన దానజల మేరులై పారుచున్నది. జైనేంద్ర మతమున కేకాతపత్ర సామ్రాజ్యము సూచించు తీర్థయాత్రా సామగ్రి యిట్లున్నది.

విబుధులకు సహజబంధుడగు వస్తుపాల మంత్రి శుభ ముహూర్తమున రాజానుమతినంది బయలుదేరి తనయెదుట ఫలపుష్పములు కొనివచ్చుచున్న యుత్తమకాంతను జూచి యాత్ర నిరంతరాయముగ సాగగలదని నిశ్చయించుకొనెను. పాలచెట్టుక్రింద క్షణము నిలచి తన ననుసరించి వచ్చుచున్న వారిని మరలించెను. వస్తుపాలుడు సహజద్వేషము కలిగియు నాచార మనుసరించి పాచికల గ్రహించెను. సత్పురుషులకు నీచులను సైతము పవిత్రుల జేయువలయునను లోభము మిక్కుటము కదా! ఆ సంఘమందు తోరణములుగల దేవాలయము లేడువందలుండెను. ఇక తేలిక దేవాలయము లెన్ని యున్నవో యెవ్వరెరుగుదురు? మంత్రీశ్వరు నెదుట సింహ

వాహనమున నంబికయు, గజవాహనమెక్కి కపర్దియక్షుడు కనిపించి సాగిపోవుచు సంఘరక్షణమం దప్రమత్తులై దుర్గమ మార్గములందును నిర్విఘ్నముగ నన్నపానాదులు కల్పించు చుండిరి.

సరస్వతీకంఠ సువర్ణభూషణుడు, షడ్దర్శనీ కల్ప ద్రుముడు, నౌచిత్యచింతామణి, యార్హతేశ్వరుడు, సర్వజ్ఞ ధర్మైకధురాధురణుడు, శ్రీ భోజరాజు, కవి చక్రవర్తి, సమగ్రచైత్య నిర్మాణ సావధానుడు,, దానైకవీరుడు, కలి కాలకాలుడు, జినేశ్వరాజ్ఞాప్రతిపాలకుడు, రాజేంద్రస్థాపనా చార్యుడు, కవికల్పతరువు, సదీకాన్వయసంహారి, శంఖమాన విమర్దనుడు, జ్ఞాతిపాలనప్రోల్ల సత్పుణ్యప్రవాహ వరాహుడు, కుర్చాలసరస్వతి, దాడీవాలా సరస్వతి, ఫ్రంభారతి, సరస్వతీ కంఠాభరణుడు, వాగ్దేవీసూనుడు, సరస్వతీ పుత్రుడు, లఘు భోజుడు మొదలగు బిరుదములు కవికుంజరులు పఠింప విలాస ముగ గజరాజు నారోహించి సాగిపోయెను. లలితాదేవి విలా సముగ సుఖాసనాసీనయై, సౌఖ్యలతా సమేతయై మార్గమందు గోరినవానిని యాచకుల కొసగుచు, ద్రివిధశీల సంపన్నయై, తపఃపూజా పరాయణయై, చామరవీజ్యమానయై సాగి పోయెను. తేజఃపాలుడు యుద్ధకండూతిగల రాజులను తార లకు సూర్యుడై సర్వాంగ సంరక్షణమందు జాగరూకుడై, యుక్తిమంతులలో నున్నతుడై దివ్యశ్వేతాతపత్రము దాల్చి చామరవీజ్యమానుడై పంచరత్నాభిధవాజి రత్నమారో హించి పయనము సాగించెను. అనుపమాదేవి మార్గమందు

సంవిభాగవ్రతమును బాలించుచు, శీల సద్దర్శనోజ్వలయై, దానధర్మము లాచరించుచు సాగిపోయెను. అనుపమాదేవి యాత్రులకు శాంతిగూర్చు నౌషధము. సాధువుల కనుదిన ముత్తమభోజ్యము లొసగి తల్లివలెఁ బ్రసిద్ధురాలాయెను. మంత్రిసోదరులు శ్రమణసంఘు సమేతులై, ప్రాణులకోరికల దీర్చుచు, సాధువందన మాచరించుచు, సాధువులకు భోజనములు చేయింపుచు వర్ధమానమహాపురము చేరిరి. సంఘేశ్వరులకు సరస్తీరమున నివాసము లేర్పరచి సాత్రోత్సవముల గావించిరి.

ఆ పట్టణమందాస్తిక శ్రేణీవేణీరత్నమగు రత్నశ్రేష్ఠి వంశపరంప రాగతముగ వచ్చు శంఖమును వస్తుపాలునకు బహూకరించి సంఘమువారికి భోజనభాజనాదు లొసగి తృప్తి పరచెను. తానును వారితోబాటు యాత్రకుఁ బ్రయాణమాయెను. వస్తుపాలు డాపురమునందలి వర్ధమానజినేంద్రునకు నేబదిరెండు జినాలయములుగల ప్రాసాదమునిర్మించెను. దానికి మూడు ద్వారములున్నవి. దానికి బంగారు కలశములు, దండ లలంకరింపబడి యుండెను. నిరాధారమగు గగనమున బోవు దేవతలకు విశ్రాంతి కొరకన్నట్లున్నత దుర్గము ,నిర్మించెను. తైర్థికులకు దృషాశాంతికై వాపిక నేర్పరచెను. పీరపాల దేవాలయ ముద్ధరించి రెండు సత్రము లేర్పరచెను. మంత్రి బయలుదేరి ధుంధూకపురము చేరెను.

ఆ రాజు వస్తుపాలు రాకనెరిగి జినాలయము లలంకరించి తనవారితో నాతని కెదురేగి కొనితెచ్చెను. వస్తుపాలు

డంను నిరువదినాలు గర్హ్వాతబింబములఁ బ్రతిష్ఠించెను. కుమారపాల విహారమున మూలనాయకుని ప్రతిష్ఠించెను. జన్మవసతి నుద్ధరించి బంగారు కలశములుంచెను. పోషవసతి యందుఁ దేజఃపాలుడు చంద్రకాంత మణులతో దివ్యపాంచాలికలుగల రంగమంటపమును, దనరాజు సుకృతముకోరి పాడాలయ ప్రాంతమున జలివేంద్రను, గుందిగ్రామమున ప్రపావాపికల నేర్పఱచెను. వస్తుపాలుడు మూడు ధర్మశాలలు, రెండు విద్యాలయములు, మూడు సత్రము లేర్పరచెను. వామేయ మందిరము బంగారు కలశములతో నేర్పరచెను.

వస్తుపాలు డటనుండి బయలుదేరి మార్గమధ్యమందలి జినాలయముఁ బూజించెను. సంఘము భుజించిన పిదప భుజించును. వారికి వెనుక నిద్రించి ముందుగ నిద్రలేచును. ఆ ప్రయాణము భోజ్యములు, శీతలోదకములు, పాలుకలు గుటచే నెల్లర కుద్యాన వనసంచారమువలె నుండెను. మార్గమందలి రాజులచే గౌరవములంది మంత్రి వారినిగూడ యాత్రకు గొనివచ్చుచుండెను. అతడు పథికులు కోరిన వొసగుచు విసుగుకొనకుండెను. ముందు, ప్రక్క, నెదుట శస్త్రహస్తులగు సైన్యము జనుల రక్షించుచుండెను. వస్తుపాలుడు మార్గమందలి యాలయము నుద్ధరించుచు, ద్రమ్మికొలకు లేర్పరచుచు మార్గము సుగమము కావించుచు శత్రుంజయము చేర నరిగెను.

మంత్రీశ్వరు డాగిరీంద్రము చూచి నర్తించెను. దానము లాచరించెను. ఆతడానందముతో గుఱ్ఱముల నొసగు చుండ నుచ్చైశ్శ్రవము సైత మొసగునో యని యింద్రుడు దానిని జాగరూకతతోఁ గాపాడుకొనెను. సంఘమువారెల్లరు సంతోషించిరి. వస్తుపాలుడు సంఘముతో నా పర్వతమారోహించి శ్రీ శాంతి భర్తభవనము చేరెను. యుగాది భర్తృ జనని నర్చించెను. కపర్ది యాలయముచేరి పూజించెను. వాగ్భటుడు పూర్వము నియోగించిన శ్రావకులు పూజించి దివ్యాతపత్రము, చామరములుగొని యెదురువచ్చి సంఘీయులను వస్తుపాలుని గొనిపోయిరి. మంత్రీశ్వరుడు వారికి నాల్గులక్షల ద్రమ్మము లొసగెను.

అయనన్యపోపముడగు మంత్రి త్రైలోక్యసుందర ప్రాసాదము చేరి యథోచితపాదికా పూజనమాచరించెను. ఆదిదేవ మూలనాథు నర్చించెను. జవాడీ యుగాధీశ్వరుని రత్నముతో నర్చించెను. మంత్రి జలకమాడి శౌచవస్త్రముల దాల్చి, తిలకము దిద్దుకొని సూర్యచంద్ర మండలమువంటి కుండలము లలంకరించుకొని, హారములుదాల్చి జినాలయమున కేగుదెంచెను. ఒక శ్రావకుడు జలకలశముతో సూత్ర పాఠముతో దేవున కభిషేకము కావించెను. వస్తుపాలుడు సంఘీయులతోఁగూడి సూత్రపాఠములతోఁ బుష్పాంజలి చల్లి, దిక్పతుల నాహ్వానించి పూజించి స్తోత్రము కావించెను. శ్రావకులు కర్పూరాగురు ధూపమొసగిరి. శ్రావకులు మంత్రి ద్వయమును మధ్యనుంచుకొని కలశాభిషేకము కావించిరి.

వస్తుపాలుడు నారీమణులు నర్తింప, చామరములు చలింప, ననేకవాద్యములు మ్రోగుచుండ, లోకు లచ్చెరువంద, దేవత లానందింప స్నాత్రమహోత్సవము నెరవేర్చెను. భగవతియగు నభిషేకతోయధార ధాన్యమను కత్తివాదరవలె భవభవనభిత్తి భాగమును భేదించుచున్నది. శ్రావకులు శుద్ధవారి ధారతో జినబింబము నభిషేకించి కాషాయవస్త్రమున శుద్ధి యాదర్శోజ్వలము కావించిరి. అతడు కర్పూర కేసర మిశ్రిత చందనము నలదెను. అష్టప్రకారార్చన మొనర్చెను. నైవేద్యము, నాగవల్లీదళము లర్పించెను. కురంగీనయనల నర్తింపజేసెను. ఆ దైవము మంత్రికి హృచ్చక్రవర్తియై యతని మనము నుద్యోజింపకుండెను. నేమినాథుడు సుప్రసన్నుడై మంత్రియం దనురాగము వహించెను. మంత్రి ధూపవాసనల నొసగెను. మంత్రి సర్వచైత్యములందలి జినావళి నర్చించి యారాత్రికోత్సవ వేళకటకు జేరెను. జీర్ణపునరుద్ధరణాదుల కాతడు దైవత కోశాగారమునకు వేయి తులముల బంగారొసగెను. చందనస్వస్తిక మాచరించి పూలతోం బూజించెను. సప్తదీపములు గల కాంచనరాత్రిక మర్పించెను. చందనపుష్పాదులతో నమస్కరించి ప్రదక్షిణ మాచరించెను. శ్రావకులు బంగారుపాత్ర దాల్చి వారిధార నొసగిరి. నలుగురు ముత్తైదువలు నాలుగు నామరములు కరకంకణములు ఘల్లుఘల్లుమన విసరిరి. మంత్రీంద్రుడు దీపము కేల దాల్చెను. కొందరు తిలకము దిద్ది, చందనాదు లలంకరించిరి. శ్రావకు లర్పించిన పూదండలు దేవుని కంఠసీమనుండి జాను

పర్యంతము ప్రవేలాడుచుండెను. కులీనలగు ముత్తైదువలు ముసుగులు వైచుకొని ముక్తాపుష్పోజ్వలములగు లాజలు చల్లిరి.

ఇంతలోఁ జతురాగ్రణియగు నొకకవి విస్మయకర ముగ ప్రాగ్వాటవైశ్య వంశాలంకారుడగు శ్రీ యాభ్రుదేవు నిట్లు స్తుతించెను. "దేవతలు, మానవులు స్తుతించుచున్న దానరాధేయుడగు నాభ్రుదేవుడు సుప్రవతుడు. అతడు భృగు పురవసతియందు జినదేవునిస్థాపించి ముప్పదిరెండులక్షల ద్రవ్య ముల దానమాచరించెను. అతడు విజయమొందును గాక!"

ఇంకొక కవి యిట్లనెను. "ప్రాగ్వాట వైశ్యవంశీయుడు మంత్రిరాజగు వాగ్భటుడు శ్రీ శత్రుంజయ పర్వతమందు జినదేవుని జన్మదినోత్సవమందుఁ బరలోక దృష్టికై ముల్లో కముల వారు చూచుచుండ మూడుకోట్ల మూడులక్షల ద్రవ్య ముల శ్రీ మూలనాథాత్ముని చైత్యముద్ధరించు వ్యాజమున విగ్రహము క్రింద నిధానముగ నుంచెను. అతడు జయించు గాక!"

సోమేశ్వర కవి యిట్లనెను. "శ్రీ జినధర్మధురీణుడగు వస్తుపాలుడు శారదా సుకృత త్రివేణియందు జంగమసంగమ పుణ్యముగఁ దోచుచున్నాడు. అతడెట్లు శ్లాఘింపబడ కుండును?"

హరిహరకవి యిట్లనెను. "రణములందు శూరుడు, చర ణము లాశ్రయించినవారికిఁ జంద్రుడు, కుత్సితులకుఁ గుత్సి తుడు, విషయనివేదనమందు బుధుడు, నీతి బృహస్పతి, కవులలో

పుత్రుడగు వస్తుపాలుడు సకలగ్రహస్వరూపుడే కాని మందుడు కాడు".

మదన కవి యిట్లు వక్కాణించెను. "సరస్వతీదేవి శ్రీ భోజరాజ వదనాంభోజ వియోగ విధురచిత్తమును శ్రీ వస్తుపాల ముఖచంద్రునందు సంతోషపరచుకొను చున్నది".

వీకల కవి యిట్లనెను. "శ్రీ వస్తుపాలుని ముఖము లక్ష్మీనివాసమగు కమలము. ఆతనికుడిచేయి వ్రేళులను పేరుతో దేవతల వృక్షముల నైదింటిని ధరించుచున్నది. యాచకుల కాతని నాలుక చింతామణి! ఆతని నేమని వర్ణింపగలను?"

మంత్రీశ్వరుడు వారికిఁ బ్రత్యేకముగ లక్షద్రమ్మము లొసగెను. శ్రీ నాభేయమూర్తి యెదుట మంగళదీప మిడుచుచుఁ గవులకు నలువది లక్షల ద్రమ్మములొసగెను. మంత్రి దేవునకు మ్రొక్కి స్తుతించి చైత్యములందంతట నుత్సవము లొనరించి సూరివందన మొనరించెను. వినయ నమ్రుడగు మంత్రితో నరచంద్రమునీశ్వరులు "వస్తుపాలా! నీవు ధర్మ మున కుపకరించుచున్నావు. నీకు ధర్మ ముపకరించుచున్నది. మీ యిరువురకుఁ గలయిక యుక్తమే!

మంత్రీశ్వరుడు శుచియై యుపవసించి ధూపవాసన లతోఁ బర్వతమును వాసింపజేసెను, ఋషభప్రభు నెదుట నాంతరధ్యానమున లీనుడాయెను. తేజఃపాలుడు ప్రభువు శిర మందు సూర్యబింబమువంటి హేమమాణిక్య మకుట మలంక రించి యద్భుత రత్నములతో నవాంగపూజన మాచరించి

యర్చకులకుఁ దొమ్మిదిలక్షల ద్రమ్మము లిచ్చెను. జైత్ర సింహుడు రత్నకుండల మలంకరించెను. లలితాదేవి విజయా హ్వాయ ముక్తాహార మొసగెను. అనుపమాదేవి జగత్పతి ఫాలమందు లక్షమూల్యమగు తిలకముంచెను. సౌఖ్యలతా దేవి రత్న తోరణముగల హేమచ్ఛత్ర మొసగెను. అను పమాదేవి ముప్పదారులక్షల రత్న స్వర్ణమౌక్తికములతో నర్చించెను. లలితాదేవి ప్రాసాదమునుండి యీవలకు వచ్చి శృంగార భవనము నిర్మింపజేసి దివ్యాలంకారము లొన రించెను. భూపలదాసి లక్షమూల్యమగు భూషణమర్పించెను.

వస్తుపాలుడు తేజఃపాల పురస్కృతుడై రెండవ దిన మందు వాసరోత్సవ మాచరించుటకు వచ్చి దేవతారాధన మాచరించి మాలాధారణార్థము రంగమంటపమున కరుదెం చెను. నరచంద్రాదిసూరు లెల్ల రరుదెంచిరి. చైత్యరక్షాధి కారులువచ్చి దేవుని పూదండను జూపించిరి. మంత్రీశ్వ రుడు మాల్యమూల్యముగ నిరువదినాల్గు లక్షల ద్రమ్మము లొసగి యింకను ధరపెట్టదలచు వారిని జూచి విస్మితు డాయెను.

ఇంతలో గుణవంతుడు, దరిద్రుడగు టీలశ్రేష్ఠి నేతి నమ్మికొనవచ్చి వస్తుపాలునితో "మీరు నా సర్వస్వమును గైకొని నాకీ పూదండనీయు"డని కోరెను. మంత్రి యాతనిని జూచి "యో మహాభాగా! నీవెవరవు? నీవద్ద నెంత ధన మున్న"దనెను. అతడు మంత్రితో "మంత్రీంద్రా! నావద్ద పన్నెండు స్ఫూర్జకములున్నవి. అవి నేతియమ్మకము వలన

వచ్చినవి. నామీద దయజూపి నా కాదండ నీయవలసిన" దనెను. మంత్రి సంతోషముతో "నిర్ధనుడైనను నతని స్వభావము మెచ్చదగియున్నది. నేనతని కోర్కె తీర్చెదను. శక్తియున్నప్పు డోర్పు, యౌవనమందు వ్రతము, దారిద్ర్యమందత్యల్ప దానము సైత మధిక ఫలము కూర్చు"నని తలచి సంఘానుమతితో నాతని కాదండ నొసగెను.

ఒకనాడు మంత్రీశ్వరుడు దేవున కారాత్రికోత్సవము కావించుచు శ్రావకులు మంగళము లాచరించుచుండ శోభన శిల్పి నిర్మించిన జ్యోతిరస శిలాఘటితమగు తనతల్లి విగ్రహము ను బ్రతిష్ఠించుటకై కొనిరాగా జూచి వాడినమోము దమ్మితో బిగ్గరగ విలపించెను. నరచంద్ర గురువు సమీపించి మంత్రీశ్వరునిట్లు ప్రశ్నించెను. "మంత్రీశ్వరా! యీ శుభసమయ మందేల విచారించెదవు? నీవు మంత్రిపద మలంకరించి యెల్లర కాశ్రయుడవై తివి. నిన్నుజూచిన శత్రువులు వినతానందకారకుడగు గరుడునిజూచిన పన్నగముల వలెఁ బారిపోవుచున్నారు. చంద్రునివంటి నీ యభ్యుదయము ను బంధుచకోరము లెదురుచూచుచున్నవి. హిమవంతు నుండి గంగ ముల్లోకములకు వ్యాపించినట్లు రాజనీతి నీనుండి రాజులకు వ్యాపించినది. ధర్మము నీవలనఁ బ్రకాశించుచున్నది. వైశేషికమందుఁ దత్త్వవేత్తలు రంజిల్లినట్లు దేవతలు నీ వలన రంజిల్లుచున్నారు. నీకేమి కొదువ? ఏల నీయకారణ విషాదము?"

వస్తుపాలమంత్రి గురువుతో "దేవా! యీ నా దుఃఖము మానసికమైనది. ఈ సంపదలన్నియు నాకు నా తల్లిని జూపలేవుకదా! బాల్యమునఁ దల్లియు, యౌవనమునఁ బ్రేయసియు, వార్ధక్యమున సత్పుత్రుడు మరణించుట ఘోర పాపవృక్ష ఫలములు. నా తల్లియున్నచో నీ నా యైశ్వర్యముచూచి యెంత సంతసించెడిదో గదా!" యని విన్నవించెను.

నరచంద్రగురువు "మంత్రీశ్వరా! యీ సంసారమందెవరి కోరికలు సంపూర్ణముగ నెరవేరగలవు? దైవఖండితులు గాని వారెవరు? కాన నీవు తప్పక జరుగగలవానికి విచారింపకుము. ఈ సుఖములజూచుకొని యూరడిల్లు" మనగా మంత్రి "దేవా! లోకమందేతల్లియు మాతృమరణానంతరము బహుభాగ్య ఫలములందుకొను నావంటి కుమారునిఁ గనకుండుగాక!" యని యనగ గురువు "ప్రాణుల కోరికలు తగిన పుణ్యము లేనిదే యీ సంసారమున నేరవేరవు సుమీ!" యని యోదార్చెను.

కరుణావరుణాలయుడగు గురువోదార్ప మంత్రి యూరడిల్లి యాత్రికోత్సవ మాచరించెను. ఎనిమిది దినములిట్లు పూజలు గావించి వాగ్భటుడు నిర్మించిన నలువది దేవాలయములకు నాదాయము లేర్పరచి శ్రావకులకు యాచకులకు ధనమొసగి, దేవకోశమునకు గ్రామములొసగి దేవునకు మ్రొక్కి "దేవా! ద్యూతకారకునకుఁ బందెమందు

వియోగిజనులకు ప్రేయసియందువలె నీయందు నా మనస్సు లగ్నము చేసికొమ్మ''ని ప్రార్థించెను.

మంత్రీశ్వరుడు శ్రీ సంఘనాథులతోఁగూడి శ్రీ యుగాది నాయకుని, శ్రీ తీర్థపర్వతము నిట్లు విజ్ఞాపించి శ్రీపాద పర్వతమునకుఁ గపర్దియక్షుని సహాయ్యమున జేరెను. ఆ కుమారపాల భూపాల విహారమందు మజ్జనోత్సవము కావించి ధ్వజారోపము కావించి కలశము నేర్పఱచి లలితాఖ్యసరశ్శోభమును సస్పృహముగ జూచుచున్న మంత్రీశ్వరునితో సోమేశ్వరకవి యిట్లు వచించెను. "ఓ మంత్రీశ్వరా! లబ్ధప్రశంసము లగు హంసలతోఁ గమలములు కదలుచున్నవి. ప్రోత్తరంగ తరంగములు, నంతర్గంభీరనరములు, చటులబక కులగ్రాస లీనములగు మీనములు, పాళీరూఢద్రుమాళీతల శయాళు స్త్రీ స్తుతిగేయములు, చక్రవాకములు కలిగి తటాకము శోభిల్లుచున్నది''. మంత్రి యాతని పద్యానుప్రాసమునకు మెచ్చి పదారువేల సువర్ణము లొసగెను.

ఇంతలో నొక కవి యచ్చటకరుదెంచి "దేవా! ప్రీతుడగు సముద్రుడు నీకీ పత్రమును సమర్పించె''నని యొసగెను. మంత్రీశ్వరు ననుమతమున సోమేశ్వరగురు డాపత్రము గైకొని పండిత సమక్షమందిట్లు పఠించెను. "స్వస్తి! శ్రీ భూమిసీమా విపిన పరిసర మందుండి క్షీరాధినాథుడు భూమియందలి శ్రీ వస్తుపాలు నాదరముగ సంభోధించి యోక్షితిధవ సచివేంద్రా! నీవు నా బిడ్డకుగల కాపురుషజనిత చాపల్య దోషము ఫాలమునుండి తుడిచివేయు''మనెను. అంబుధి

కావ్యము కొనివచ్చిన కవికి వస్తుపాలుడు నాలుగు లక్షల ద్రమ్మములు నొసగెను. వర్ష ర్తువందు వర్షించిన మేఘములు శరత్కాలమున వర్షింపవు. వృక్షము లెల్లవేళల ఫలింపవు. గోవులొకప్పుడు వట్టిపోవును గాని వస్తుపాలుని మనస్సొక ప్పుడును వితరణమందు విరతినొందుట లేదు.

పిదపమంత్రి సకలసంఘముతోఁ దాళధ్వజపురముచేరి పర్వత శిఖరమునకు శేఖరమగు ప్రాసాదమునిర్మించి ఋషభ ప్రభుని స్థాపించెను. మధుమతీ పురముచేరి జవాడిశ్రేష్ఠి నిర్మించిన శ్రీ వీరమందిరమందు ధ్వజారోపము కావించి హేమకలశ మేర్పరచెను. అచ్చట స్తంభతీర్థ నివాసియు, సంఘాధిపతియునగు భీమునితో మైత్రి సల్పి యాడహార పుర మున కేగి వామేయ దేవునకు మ్రొక్కి జినాలయ ముద్ధరించి కాంచన కలశమును స్థాపించెను. ఊరిబయటఁ బుష్పవాటిక నేర్పరచెను. వాపిక నిర్మించెను. చెఱకుగడల పొలము లన్ని టిని దేవాదాయముగ నొసగెను. మూడులక్షల ద్రమ్మములు వ్యయించి యుత్సవములు కావించి కోటినారపురము చేరి చైత్యమునకు ధ్వజము లమరించి వసుధాపురిచేరి యంబా పూజ నాచరించి చైత్యమందు బంగారు కలశముంచి యర్చ కులకు సప్తవర్షాసనము లొసగెను. దేవపత్తనమున కేగి చంద్ర ప్రభుని, శంకరు నారాధించెను. తేజఃపాలుడు కైలాసాచల శిఖరమువంటి ప్రాసాదము నాదిదేవునకు నిర్మించెను. ఇరువది నలువురు తీర్థేశ్వరులకు మంత్రీశ్వరుడు బంగారు ప్రాసాదము నిర్మించెను. పౌషధశాల నిర్మించెను. దాని కాదాయముగ

నంగడివీధు లేర్పరచెను. సోమేశ్వర గురువు నర్పించి సోమ నాథ మహేశ్వరునకు మాణిక్య ఖచిత కపాలాభరణము సమ ర్పించెను. సౌఖ్యలతాదేవి పుణ్యముగోరి పార్వతీదేవికి రెండువందల అరువది నాలుగు గద్యాణములతో నాభరణ ములు జేయించెను. మంత్రి సత్రములు బ్రహ్మశాలలు నిర్మించెను.

ఒకనాడు కొంద రర్చకులు శివనిర్మాల్యము గొని వచ్చి మంత్రికొసగి ఇట్లు విన్నవించిరి. "ఓ మంత్రీశ్వరా! పరమేశ్వరుడు నీ వర్పించిన కర్పూరమును స్మరించుచు మా యొసంగిన పువ్వుల గ్రహించుట లేదు. దుకూలముల స్మరిం చుచు మేము కౌపీన మర్పింపబోగా కోపించుచున్నాడు. నీవు గావించిన క్షీరాభిషేకమును స్మరించుచు జలాభిషేకమునకు విముఖుడగు చున్నాడు. మా పశుపతి కర్పూరాగురు వాస నల స్మరించుచు గుగ్గులు ధూపము పరిహరించుచున్నాడు". మంత్రి వారి మాటలను మరలమరలఁ బలికించుచు వేయి ద్రమ్మముల నిచ్చి పంపివై చెను. మంత్రి సముద్రుని సంద ర్శించి యిట్లనెను. "నీలో మాణిక్యములు గలవు. కల్పవృక్ష ములు నీయం దుదయించినవి. అమృతము, విష్ణువు నీయం దున్నారు. గంగానది నీభార్య. యిదియంతయు వ్యర్థమే. నీ నీరుప్పనిది. పరమేశ్వరు డభ్యాగతుడై రాగ నీవాతనికి విష మొసగితివేమి?" తేజఃపాలు డిట్లనెను. "రత్నాకరా! నీ తీరమందు రత్నములు కొల్లలుగా దొరలాడుచున్నవి. ఆ రత్నాలంకారములు రాజంగనా స్తన స్తబకముల నలంకరించు

చున్నవి’’. సముద్రుడు ప్రీతిచెంది వారికి దక్షిణావర్త శంఖ మొసగెను. సాంగణుని కుమారుడు సింహసేనుడు వచ్చి మంత్రిని పూజించి వామనస్థలమునకు గొంపోయెను. మంత్రీశ్వరు డాపురమందు పుణ్యకృత్యములు గావించి జీర్ణదుర్గపురముజేరి యాదవేంద్ర నరేంద్రుని గౌరవములంది ఉజ్జయంతగిరి జేరబోయెను. ఆ గిరిని దర్శించి సంతోషముతో నర్తించి యాచకులకు దానములు జేసి ఉత్సవములపై నుత్సవములు జరిపి ఆ తీర్థప్రదేశ వైభవముల వినుచు కవులకు దానములు గావించి ఆ పర్వతమారోహించెను. తేజఃపాలునితో గూడి నేమినాథుని రత్నములతో పూజించి గజేంద్రకుండమున మునిగి స్నాత్రోత్సవము గావించి చందనాదులలది తమ్మిపూలతోఁ బూజించి నైవేద్యమొసగి నృత్యగానముల జరిపించి దానము లాచరించెను. ఆరాత్రికము గావించుచు అర్థిబృందముల జూచి కొంచెము విసువుకొని బొమముడి పెట్టెను. సోమేశ్వర కవి సమీపించి “దేవతలకు కల్పద్రుమము, నాగులకు బలి, మునులకు కామధేనువు గోరికలు దీర్చుచుండ దిక్కులేని భూలోకమువారికి దిక్కగు వస్తుపాలుడు యాచక బాధను సహింపవలసియున్న’’దనగా మంత్రి సంతోషించి అతనికి లక్ష యిరువదివేల ద్రమ్మములిచ్చి దైవపూజ నిర్వర్తించి యాచకులఁ దృప్తిపరచి మండలికి నమస్కరించెను.

జైత్రసింహుడు లక్ష ధనముతో ఇంద్రమాల గొని వచ్చి దేవునకు సమర్పించెను. చైత్యశృంగమునందు బంగారు

జండాల నాటిరి. భట్టులు జయజయమని పలుకుచుండ గంధర్వులు వాద్యములు ప్రయోగించుచుండ నొక బాలిక సమకాలమందు దాళ మొసగుచు హల్లీసక మాచరించి మల్లీమాలల నర్పించెను. వస్తుపాలుడు నేమిస్వామి మౌళియందు రత్న మకుట ముంచెను. లలితాదేవి ముత్యాల హారము, సౌఖ్యలత మాణిక్య తిలకము, తేజఃపాలుడు కర్ణకుండలములు, ననుపమాదేవి రత్నావళి, జైత్రసింహుడు అంగదములను, మల్లదేవుడు శ్రీవత్సమును స్వామికి సమర్పించిరి.

మంత్రీశ్వరుడు రంగమండపము జేరి దానములు గావించి వాగ్భట మంత్రీశ్వరుడు నిర్మించిన రైవత పర్వతారోహణ మార్గము నాలోకించి డెబ్బదిరెండు లక్షల ధనమును వ్యయించి సోపానముల నేర్పరచెను. శ్రీ రత్న నామార్హ్తుడు రెండుమాసము లుపవసించి అంబికాదేశము వలన హైమబలానకమున కేగి మణిమయమగు నేమి మూర్తిని గొనివచ్చి బ్రహ్మేంద్రాదులు నిర్మించిన చైత్యమందు ప్రతిష్ఠించెను. వస్తుపాలుడు రైవతమందు దివ్య శిలలతో నేమి మందిరము నిర్మింపజేసెను. "అమృతముకన్న మధువులు, చంద్ర చంద్రికలకన్న స్వచ్ఛములు, మావి పూగుత్తికన్న కమ్మనివాసనల గలవియు సరస్వతీ సూక్తులు కన్న మనోహరములగు శ్రీ వస్తుపాలుని సూక్తు లెవ్వరి మనములకు సంతోష మొసగవు? ఓ వస్తుపాలా! "పున్నమ చంద్రుని జయించి నీ కీర్తి భూదేవికి వల్లెవాటగు చున్న" దని కవులు స్తుతింప మంత్రివారి కోరికల దీర్చెను. మంత్రి

యచ్చట నిరువది నాల్గు లక్షల ధనము వ్యయించెను. తేజః పాలుడు లక్షకోటి ధనవ్యయము గణింపడాయెను. జైత్ర సింహుడు హర్షము తో ధనవర్షము కురిసి కవులవలన హేమాంబుదుడను బిరుదునందెను. లలితాదేవి దానలీలను జూచి శచీదేవియు మంత్రి గృహమందుండ గోరెను. పాత్ర దాన జినార్చనాదులతో ననుపమాదేవి సార్థకనామధేయ యాయెను. మంత్రి శత్రుంజయ తీర్థమందు చైత్యముల నిర్మించెను. స్తంభనక తీర్థ చైత్యమందు తనరాజు, తన భార్య, తనగురువు, బంధువుల మూర్తుల స్థాపించెను. వీర ధవళుని గజాధిరూఢునిగాఁ జిత్రింప జేసెను. తనరూపము తన సోదరుని రూపము నశ్వాధిరూఢములుగా ప్రతిష్ఠించెను. బంగారు కలశముల నైదింటి నుంచెను. ఇంద్రమండపము వెనుక వాకిటికి తోరణము కల్పించెను.

ఆ సమయమున ధర్మము తేజమిట్లు సంవాదము కావించుకొనిరి.

తేజము:-"నీవెవరవు?

ధర్మము:-అయ్యో! తేజమా! పరిచయము కలిగియు ధర్మమునగు నన్నెఱుగకున్నావా? ఎంతకష్ట మెంతకష్టము?

తేజము:-నిన్నుఁ జూచితిని గాని నీవెన్నడు నిట్లు సంతో షముగ లేవు.

ధర్మము:-కలిదలితరుచినగు నేను నిజము చెప్పుచున్నాను. వినుము. నాశత్రువు కలి నశించెను. వస్తుపాలుడు నన్ను వృద్ధిపఱచెను".

శత్రుంజయ పర్వత శిఖరమందు నుత్సవ మండప మును నిర్మించి యాత్రకావించిన వస్తుపాలుడు కరమునఁ గల్పతరువు, మానసమందుఁ జింతామణి, వాక్కులందుఁ గామధేనువు గలిగి తానే సిద్ధిగమారిపోయెను. ఆతనికి ధర్మము ఋణపడినది. తీర్థ శ్రీ కలంకారమగు నా ఖండల మండపము నిందిరామందిరమయముగ నిర్మింపజేసెను. విష్ణు దేవుడు మంత్రి యాహ్వానమున స్నాత్రోత్సవము చూడ నరుదెంచి యింద్ర విమానము, వెల్లగొడుగు, తూర్యములు, నాట్యములు కాంచి విస్మితుడై యిది స్వర్గమా భూమియా యని క్షణము శంకించెను. చైత్యమెదుటఁ బ్రాకార బాహ్యన గల తోళికను, సుధాకుండమువంటి గజపదకుండమును మంత్రి యేర్పరచెను. సంపదలకు కీర్తులకు మొలకలవంటి రెండు బంగారు ధ్వజములు ప్రాసాదముపై నిల్పెను. సరస్వతి ప్రవేశించుట కన్నట్లు చంద్రకాంత శిలలతో రెండు తోర ణము లేర్పఱచెను. పూజార్థముగా నంకపాలితగ్రామ మొస గెను. తన జ్యేష్ఠసోదరులగు లూణిగ, మల్లిదేవుల శ్రేయము కోరి వారి ప్రతిమలు హయారూఢములుగా నాలయ ప్రవేశ మందుఁ గుడియెడమల నిల్పెను. జినదేవుని ద్వారమందు శివపదారోహమార్గము వలెనున్న యారాసనీయ తోరణ మేర్పరచెను. దాని పేరు త్రిలక్షతోరణము. అది ముల్లోక ముల సౌందర్యసంపద కద్దము వంటిది. అందు దేవతా స్త్రీలు బొమ్మలై యున్నారు. సురాంగన లహర్నిశము చేతులు పైకెత్తి తీర్థమహాత్మ్యము పాడుచున్నారో యన్నట్లుండలి

బొమ్మలున్నవి. తోరణమందు త్తుంగమత్తవారణ జగతిని నిజసేనామయముగ నిర్మించెను. చతుష్కికాయుగ్మమున జైన ప్రశస్తిని జాటుచుండెను. చైత్యలక్ష్మి కన్నులవలెఁ దోరణము ప్రకాశించెను. ఆదినాథాలయ మంటపమందుఁ గూర్చున్నవారికి దక్షిణ పార్శ్వమున మంత్రి తనభార్య లలితాదేవి పుణ్యముకోరి సత్యపురతీర్థము నిర్మించి వీరనాథుని స్థాపించెను. అందు జినబింబముగల మంటపము కలదు. ఎడమ ప్రక్కన సౌఖ్యలతా శ్రేయముకోరి తానశ్వావబోధ తీర్థమేర్పరచెను. అందు సువ్రతదేవునిఁ బ్రతిష్ఠించెను. అశ్వ శకునీ వటమందలి మృగయు ముని సమవసరణము నిర్మించి యందుఁ దన ప్రతిమను, సౌఖ్యలతా ప్రతిమను, శిలామేఘ రాజవణిజయగు సుదర్శనాదేవి ప్రతిమనుఁ బ్రతిష్ఠించెను. దాని యెదుటఁ దన ప్రపితామహుడగు చండప్రసాదుని పుణ్యముకోరి జితసంభవ జినయుగళి నేర్పరచెను. అచ్చట మంత్రి తనకు లలితాదేవి శ్రేయముకోరి యుత్తరముఖముగ రెండు దేవనాగములను స్ఫటికద్వారమును నిర్మించెను. ఆదిజిన చైత్యమందు దక్షిణోత్తర పార్శ్వముల నాలుగు నాలుగు చతుష్కికల నేర్పఱచెను. నాభేయ మూలచైత్య మందు మరుదేవీ గృహమునకు హేమదండముతో బాటు కాంచన కలశములుంచెను. ఆ యుగాది దేవాలయమందు మనుమడగు ప్రతాపసింహుని శ్రేయముకోరి మూడు మంట పములకు మూడు బంగారు కలశములు నిలిపెను.

తేజఃపాలు డనుపమా పుణ్యముకోరి శ్రీ పార్శ్వజిన మూ ర్తికి శంఖావతార చైత్యమేర్పరచెను. ఇంద్రమండప సమీపమందు నందీశ్వరుని స్థాపించెను. తనకు తమ యేడ్వురు సోదరీమణుల శ్రేయముకోరి దేవనాగము లేర్పరచెను. తన స్నేహితుడగు యశోరాజశ్రేష్ఠి శ్రేయార్థము నాలుగు దేవ నాగము లేర్పరచెను. అనుపమాదేవికిఁ దనకు మేలుకోరి మారాసనీయ శిలలతోఁ దమమూర్తు లం దేర్పఱచెను. అను పమాదేవి పుణ్యముకోరి యనుపమా సరస్సు నేర్పరచెను. దాని యొద్దున జినపూజకు బుష్పవాటిక నిర్మించెను. ఆ సరస్సు పాలసంద్రము. దాని యొద్దున గపర్దియక్షునకు నంబి కకు దేవతాలయకైతవమున వేలాశైల మేర్పరచెను. అచ్చట తటాక తిలకోపరిభాగము కపర్దియక్షశైల శ్రీ సీమంత సదృ శముగఁ బద్యబంధము కూర్ప జేసెను.

వస్తుపాలు డాయాలయమున కెడమప్రక్కఁ దోర ణము నిర్మించి దాని పరిధియందు నారాసనీయ జగతి నేర్ప రచెను. పార్శ్వగృహమునకు ఖత్తకద్వారము నేర్పరచి బంగారు, వెండి, ముత్యములు, పగడములు ఇంద్రనీలములు కూర్చిన మూర్తిని స్థాపించి మధ్యప్రదేశమున స్వర్ణతోరణ మేర్పరచెను. అంకుఁ గపట్ట స్తంభప్రదేశము బంగారు కాంతితో మెరుపుతోగూడిన మేఘము వలెనున్నది. శత్రుం జయగిరిక్రిందగల వాగ్భటప్రప జలశూన్యమైయుండుటకాంచి లలితాదేవి శ్రేయముకోరి కమ్మనినీరు, హంసలుగల లలితా సరోవర మేర్పరచెను. ప్రజలు దానిని జూచి మానస సరో

వరమని భ్రాంతినొందు చున్నారు. మంత్రి సరస్సీమయందు రవి, శంకర, సావిత్రీ, నీరజినాంబా కపర్దికాలయము దేవతా ప్రతిమల స్థాపించెను. దేవపూజకుఁ గణపముతోఁగూడిన వాటిక నేర్పరచెను. యుగాది జినమందిర ముద్ధరించెను. పాంచజన్య సదృశకీర్తియగు మంత్రి తమ్మిపూలు కల సుధా కుండమగు కూపము నిర్మించెను. వాలక, ఖండపద్ర గ్రామములందు వటకూపమండపముల సమానముగ నిర్మించెను. వీరేజ్య గ్రామమందు వస్తుపాల విహారముకూర్చి యాత్రికుల సుఖమునకు సత్రములు చలివేంద్ర లేర్పరచెను. వీర గ్రామము దేవపూజ కొసగెను. సౌఖ్యలతాపతి ప్రతోళీవప్రములుకల యైదు మండపములను నిర్మించెను. అన్నిదానములలో నన్న దానము శ్రేష్ఠమనియు నది తీర్థభూమియం దధికఫలమొసగు ననియుఁ దలఁచి రెండు సత్రము లేర్పరచెను. అందుఁ దైర్థి కుల కన్న దానము లాచరించుచుండిరి. తండ్రిపేర జినాల యము, తల్లిపేరఁ జలివేంద్ర, జననీ జనకులపేర సత్రము, తనపేర సరఃపురాలయము, పాంథకుటీరముల గ్రామేంకపాలీ యకమందు గావించెను. అతడా గిరియందుఁ బదునెనిమిది కోట్ల పాఖండ సంఖ్యా లక్షలు స్థాపించెను.

శ్రీ యుజ్జయంత పర్వతమందుఁ జైత్యము తన శ్రేయమునకు మంత్రి నిర్మించెను. వస్తుపాల విహార మేర్పర చెను. ప్రాసాదమును బంగారు కలశములుంచి, పతాక లలం కరించి కైలాసాచల సోదరముగ నిర్మించెను. కార్తికచంద్ర దళముల ప్రోడనా లేక పాలసంద్రపు టలలతో నిర్మింపబడె

నోయన్నట్లున్న నాభేయమూర్తిని స్థాపించెను. తన యన్న మేలుకోరి యజితబింబము స్థాపించెను. చండపునిపేర మండపము నిలిపి యంబికను వీరజినుని స్థాపించెను. ఆ మండప గర్భగృహ ద్వారమునకు దక్షిణోత్తరములందు తన ప్రతిమను, తమ్ముని ప్రతిమను నేనుగులపై నెక్కినట్లు నిర్మింపజేసెను. దాని యెడమప్రక్క లలితాదేవి మేలుకోరి తన యన్న ప్రతిమ నేర్పరచెను. దాని కుడిప్రక్క సౌఖ్యలతాదేవి శ్రేయముకోరి తన తల్లి, చెల్లెలు రూపముల బంగారుతో నిర్మించి స్థాపించెను. మూడు ప్రాసాదములకుఁ దోరణము లేర్పరచెను. వస్తుపాల విహారము వెనుక కపర్దియక్షుని గుడి కట్టించెను. మరుదేవుని కేతనమందు తనతల్లి ప్రతిమ నేనుగుమీఁదెక్కినట్లు చిత్రింపజేసెను. మూడు మండపములకుఁ దోరణముల నిల్పెను. నేమి భవనమునకు నాల్గు దిశలందుఁ దోరణము లేర్పరచెను. చైత్యమునకు దక్షిణోత్తరములందుఁ దండ్రి తాతల ప్రతిమల హయారూఢములుగఁ జిత్రించెను. తల్లిదండ్రుల శ్రేయమునకు నజిత, శాంతి విగ్రహము లేర్పరచెను. ఇంద్రమండప మేర్పరచెను. వంశము మూర్తులతో స్తంభము స్థాపించెను. తన యగ్రజుల మూర్తులతో దేవకులికల నేర్పరచెను. నేమి మండపములకుఁ గలశము లుంచెను. అంబికా మండపమేర్పరచి యారాసనీయ దేవనాగముల స్థాపించెను. అంబికా చైత్యమేర్పరచి నేమిమూర్తిని మల్లదేవమూర్తిని జండపుని పుణ్యముకోరి నిర్మించెను. అవలోకనాశిఖరమందుఁ జండప్రసాదుని పుణ్యమునకై.

నేమి మూర్తిని, దన మూర్తిని నిర్మించెను. ప్రద్యుమ్నశిఖర మందు సోముని శ్రేయమునకు సోమమూర్తిని తేజఃపాల మూర్తిని స్థాపించెను. శాంబశిఖరమందుఁ బిత్రుశ్రేయముకొరకు జినేంద్రమూర్తిని, మాతాపితరుల మూర్తుల నేర్పరచెను. తేజఃపాలుడు నేమినాథ భవనము విమలోశ్మములతో నిర్మించి యేడువందల యరువదినాలుగు బంగారు నాణెము లతోఁ గలశమేర్పరచెను. తైర్థికులకై జలకుండము లేర్ప రచి తేజఃపాలపురము నిర్మించి యంగడి వీథులు, బావులు, సంఘేశ్వర గృహములు, సత్రములు నిలిపెను. అచ్చటి ప్రజలకు పన్నులు లేవు. వస్తుపాలుడు తండ్రి పేరుతో నాసా రాజవిహారము నిర్మించి బాహ్యప్రదేశమునఁ గుమారదేవీ సరస్సు నిర్మించెను. అచ్చట పార్శ్వప్రతిమ లేర్పరచెను. ఉద్యానవనము నేర్పరచెను. తేజఃపాలుడు తన పేరి పురము నకు వామనపురమునకు వాపిక నేర్పరచి వామనస్థలియందు కౌముదీకరమగు వసతి నేర్పరచెను. మంత్రి కుహేడికా గ్రామము సాధువుల కొసగెను. మంత్రి వస్త్రాపథమునుండి గిరియాత్రల కేగువారికిఁ బన్నులు తొలగించెను. గోమతీ వార్థిసంగమ మందు నేమిచైత్య మేర్పరచెను. శంఖోద్ధార ద్వీపమందుఁ దేజఃపాలుడు ప్రథమార్హత మందిర మేర్పర చెను. శంఖేశ్వర గృహముద్ధరించి మంత్రి రైవతాచల మందు సత్రములు, మఠములు, సంఘగృహము లేర్పరచెను, మంత్రీశ్వరు డాతీర్థమందుఁ బన్నెండుకోట్ల ముప్పదెనిమిది లక్షల ద్రమ్మముల వ్యయించెను.

వస్తుపాలమంత్రి బయలుదేరి నదులను, దనకీర్తులవంటి గ్రీష్మమేఘములను దర్శించుచు రాజధానిఁ జేరెను. వీరధవళ ప్రభువు పురజనులతో బారెడు రేగి సంఘముతోఁబాటు మంత్రులను గొనివచ్చెను. పౌరులు గృహములకు దోరణములు నిర్మించిరి. దేవత లానందదాతలైరి. రాజమార్గము రాకాకాశము బోలెను. అంగడులమీదఁ బతాకము లలంకరించిరి. జనులు గంగవలె లోకులఁ బవిత్రులగావించిరి. రాజు ధవళాగారమందు విందు కావించెను. ఆ సామగ్రీ సన్నాహములకు లోకులచ్చెరువొందిరి. భోజనానంతరము రాజు సంఘీయులను గుసుమాదులతో నర్చించి వస్త్రము లొసఁగి యెల్లర సత్కరించెను. రాజు వారిని మీకీయాత్ర యందెంత వ్యయమైనదనెను. రత్నార్హతుడు రెండుకోట్ల ద్రమ్మములు, భీముడు ఎనిమిది లక్షల ద్రమ్మములు, ఆభటసాధువు కోటి పదారు లక్షల ద్రమ్మములు వ్యయమైనవనిరి. ఆభటసాధు పుత్రు డాసపాలుడు "తనకు శత్రుంజయమం దిరువదినాల్గు వేలు, రైవతమం దారువేలు వ్యయమైనవి. దేవపత్తనమందు లక్ష వ్యయమాయె"నన వస్తుపాలు "డచ్చట నంత నెట్లు వ్యయించితి"వన నతడు ముగ్ధహృదయు డగుటచే "సర్వశాస్త్రములు నేర్చిన నాగురువగు బ్రాహ్మణుడు ప్రభాసతీర్థమం దన్నపాన తత్పరుడనగు నాతో "జైనతీర్థములందు వ్యయించిన పాపనివారకముగ లక్ష ద్రమ్మములఁ బాలతో శుద్ధిచేసి ప్రియమేలక తీర్థమున బ్రాహ్మణుల కీయవలెనన నట్లు చేసితి"ననెను. ఆసపాలుని వాక్యములు విని మంత్రి

యాతనిని గోపించి శ్రావకసంఘ బహిష్కృతుని గావించి యాతనితండ్రి ప్రార్థనపై ప్రాయశ్చిత్తమువిధించిక్షమించెను. శ్రీ సంఘమువారిని మంత్రి యథాస్థానములకు సాగనంపెను.

మంత్రీశ్వరుడు రాజవర్గముతో వీరధవళస్వామి నొక నాడు తనయింటికి విందునకు బిలచి భుజింపజేసి యాతనికి నవరత్నములతో నవాంగపూజ కావించి తనకు సముద్రు డొసగిన దక్షిణావర్త శంఖము కానుకనొసగి, గజతురగరాజి నొసగి, వస్త్రాదులలంకరించి మిక్కిలి సంతోషపఱచెను.

మంత్రీశ్వరుడు తీర్థయాత్రా వ్యాజమున దిగ్విజయ యాత్రకావించి బలవద్విరోధియగు కలిపురుషుని జయించెను. పుండరీ కోజ్జయంతాది తీర్థములందు, ధవళక్కపురమందలి శత్రుంజయావతార చైత్యమందు, నుజ్జయంతావతార చైత్య మందు మజ్జనోత్సవము లుపవసించి కావించుచు శాంత వంతుడు, సానుజుడగు మంత్రి చంద్రుడు సంవత్సరకాలము సంఘవాత్సల్యము నెఱపి పారణదినమందు మునులను బవిత్ర వస్తుదానములచేఁ దృప్తుల గావించి జగతీ తలమును తనకీర్తి సుధాధవళిత మాచరించెను.

ఇట్లు వస్తుపాల మంత్రీశ్వరుడు తీర్థయుగాది దేవతా వందన విధానము సమ్యగాత్ముడై కావించుచు హర్షప్రకర్ష పూరిత హృదయుడై తీర్థాలోకదినములందా రెండు తీర్థము లం దభిషేకోత్సవములు కావించుచు ధ్వజారోపములతో సకలచైత్యము లలంకరించుచు గణభృతులకు, నర్హాత సంత తికి సవిస్తరముగ నర్చనలు కావించుచుండెను.

# ౭

ఒకనా డుదయమందు వీరధవళుడు నిండుకొలువుతీరి యుండ గూఢచారు లరుదెంచి యోగినీపురమందలి మోజ దీన మహారాజు సైన్యము ఘుర్జర భూమిమీద కెత్తివచ్చు చున్నదనిరి. వీరధవళు డావాక్యములను విని వస్తుపాలుని కర్తవ్యమును గూర్చి ప్రశ్నించెను. వస్తుపాలుడు తాను దండయాత్రకు బోవుదునని పలికి రాజానుమతినొంది చతు రంగ చమూభారముతో భూమిని వణకించుచు, దానములు గావించుచు బయలుదేరెను. సామంతపాలాదు లాతనికి వెన్నంటి నడచిరి. ఆతడు సేరీసకపురము చేరి శ్రీ పార్శ్వ జినేశ్వరుని బూజించి, యుత్సవములు కావించి బంగారు కల శములు స్థాపించి నాలుగు చతుష్కికలను ధర్మశాలలను స్థాపించెను. అచ్చట మంత్రి జినాధీశ పూజార్థము పూదో టను, వాపీప్రపలు గల సత్రాగారము నిర్మింపజేసెను. మంత్రి యచ్చట లక్షద్రమ్మములు వ్యయించి ధార్మిక పురము నిర్మించి పత్తనము చేరెను.

వస్తుపాలు డచ్చట నారాత్రి నిద్రించుచుండ నాతని భాగ్యభరాకృష్టయై మహాణాదేవి స్వప్నమున సాక్షాత్క రించి "వత్సా! యవనుల గెలుచు నాలోచనలతోఁ జీకాకు పడకుము. యవను లర్బుదాచల మార్గముగ నా దేశము ప్రవేశించెదరు. ఆ సేనలుపోవు దుర్గమ మార్గఘట్టములన్నియు

నెవు వీరులతో నాక్రమించి యవనసేనలు విడిచి కాక, యన్న పానాదులు గొను సమయమందు నాకస్మికముగ వారిపైఁబడి పోరాడుము. నా యనుగ్రహమున నీకు జయము సిద్ధింప గల"దనెను.

ఈ విధముగు దేవతాదేశనము విని మంత్రి నిద్రలేచి శౌచాచారము తీర్చి, యిష్టదేవతల నర్చించి పల్యంకిక నారోహించి యర్బుదగిరి చేరి సమీపమందలి ప్రహ్లాదన పురమున కేగి శ్రీ పామేయు దేవత నర్చించి యాలయమందు మూడు బంగారు కలశములుంచి శ్రీ నేమివాముఖ త్తకమందు బృహద్బింబము స్థాపించి బలానక మంటపముద్ధరించి పూగీ ఫల శ్రేణుల నాదాయముగ నొసగెను.

వస్తుపాలుడు గిరీంద్రైశ్వర్య శాలియగు ధారావర్ష నరేంద్రునిఁ గలిసికొనుటకు చంద్రావతీపురమున కేగి కొన్కా లంది యవన సేనాగమన వృత్తాంతము తెల్పి యాతని సైన్య ముతో నాతనిని దోడ్కొని యవన సేనాబలము వచ్చు చుండుట చారులవలన నెఱిగి, దేవతాదిష్ట విధానమున వస్తుపాలుడు యుద్ధమొనరించెను. యవనసైన్యమునకు వెనుక ధారావర్ష రాజు ముందుభాగమున వస్తుపాలుడు పూని భీమా ర్జునులవలె నిర్దయముగ హింసించిరి. ఆ సేన మృగీలోచనయగు బాలవలె రోదించెను. యవన సైనికులు నోట వ్రేళ్లుంచు కొని లజ్జాహీనముగ శత్రువులపాదములందు వ్రాలుచున్నారు. కొందరు తమ వస్త్రముల నస్త్రములఁ బరులకొసగు చున్నారు. వీరుల మొండెములు నర్తించుచు క్రిందబడు

చున్నవి. అవి యప్సరసల ముఖములఁ జూచి నర్తించినవో యన్నట్లుండెను. కొందఱు వీరపత్నులు వీరశయన మందిన ప్రాణనాథుల ముఖముల ముద్దిడుకొని మూర్ఛిల్లుచున్నారు. ఒక పతివ్రత తననాథుని మొండెము నొడియందుంచుకొని చెలికత్తెలతో నాటలాడించుచుఁ బాటలు పాడించుచుండెను. ఒక యుత్తమాంగన మోహమూఢయై వీరశయన మొందిన భర్తనోట పెదగన్నపు ముద్దనిడుచుండెను. ఒకతె రణభూమియందు విహరించిన తనభర్త పాదము లొత్తుచుండెను. ఒకతె రణభూమియందుఁ దనకు విముఖుడై పడియున్న భర్తను మహాగుణయై తీక్ష్ణకటాక్షములతోఁ బ్రహరించుచుండెను. వస్తుపాలుడు రణక్షోణియందు నశించుచున్న శత్రుసైన్యమును బూచి రణము విరమింపజేసెను. ప్రతిపక్షనాయకులు పిక్కబలము చూపిరి.

వస్తుపాలమంత్రి తనకీ యుద్ధములోఁ దోడ్పడిన పరమార నరాధీశ్వరు సీమాసమాన దానాదులతో నానంద పఱచి పత్తనపురమున కేగుదెంచెను. అచ్చట తనతల్లి కుమారదేవి పేర నాసారాజ విహారము స్థాపించెను. అందు గజతురగ చిత్రములు, డెబ్బదిరెండు జినాగారములు, డెబ్బదేడు బంగారు కలశములు కలవు. తేజఃపాలు డచ్చట తన తల్లి ప్రతిమను గజారూఢముగ నేర్పరచెను. ఆహాడదేవుడు నిర్మించిన చైత్యముఖ మండపమందు ధాతుమయ నేమినాథ ప్రతిమను నిర్మించెను. కోరటావలగచ్ఛీయ చైత్యమందు చంద్రప్రభ జినుని, సండేరవాల వసతియందు కాయోత్సర్గ

మొనరించిన జినద్వయమును స్థాపించెను. శ్రీ సాంతూవసతి నుద్ధరించెను. దాని శిఖరమందు బంగారు కలశములుంచెను. మల్లినాథ జినేశవసతి యూకేశ వసతులందు బింబముల స్థాపించి, వీరాచార్య జినాగారమందు గజశాల నేర్పఱచెను. దాని నడుమ స్వర్ణవిగ్రహము చైత్యము నేర్పరచెను. ధర్మ శాలలు స్థాపించెను. నాగేంద్రగచ్ఛ సాధువులకు యూడంత స్తుల మఠము లేర్పరచెను. మంత్రి దీనులు, ఆర్తులునగు ప్రజలకే కాక పశువులకును సత్రములు స్థాపించెను.

ఆ విధముగ వస్తుపాలుడు సజ్జనశ్లాఘ్యమగు సంఘ వాత్సల్యము ప్రదర్శించి సాధువుల నందరను సన్మానించెను. అతడు వర్ధాపనోత్సవము కావించి మార్గమందలి ప్రజలు పొగడుచుండ ధ్వజము లలంకరించిన ధవళక్కపురమును జేరెను. అతడు విస్మేరముఖాంబుజుడగు వీరధవళాధీశ్వరు నకు మ్రొక్కి యవనులతోడి పోరునందు దొరకిన కానుకల నర్పించెను. వీరధవళుడు పంచాంగ పూర్వకప్రసాదము మంత్రికిఁ గావించి ప్రీతితో నాతని నధికముగ నిట్లు స్తుతిం చెను. "శత్రుపట్టణముల కేగకనే, కోపవికటాననము దాల్ప కనే, తురగఖుర పుటములతో ధరణినిఁ బెళ్లగింపకనే, తిర స్కార వచనములు పలుకకనే, వసుభాతలైక తిలకుడవగు నీవు రాజ్యభారము భుజాస్కంధము లందుంచుకొని యుచ్చ తటీ విటంక విషయములగు తీర్థముల లంఘించుచు గన్పించు చున్నావు".

మంత్రి రాజుబలవంతముమీదఁ బట్టపుటేనుగు నెక్కి, బంగారు గొడుగులు భటులు పట్టుచుండ నుత్సవముతో నింటికేగెను. వస్తుపాలున కుత్సాహముతో నప్పసెల్లెండ్రు హారతులిచ్చిరి. ఆతఁడు వారి మనస్సుల కాలోచింపనలవికాని సంపదలొసగి సత్కరించెను. రాజవర్గము మంత్రికి కానుక లొసగిరి. మంత్రి మహోత్సవ సమయమందు ప్రజలకు ద్రవ్యమునకును నొక పూర్ణైనను దొరకకుండెను. వస్తు పాలునకు పౌరవర్గము మహోత్సవములఁగావించెను. ఇంటిం టఁ గులాంగనలు మంగళగీతములు పాడిరి. రాజమార్గము లందు నిషేకశోభ, పురుషులందు విశేషహర్షము, దేవాల యములందు విశేషపూజ, స్త్రీలయందు విశేషవేష మేర్పడెను.

వస్తుపాల మంత్రీశ్వరునకుఁ గవీశ్వరుల వాక్కులు తృప్తి కలిగించినవి. కర్ణసమానుడగు మంత్రి వారి హృద యములందౌదార్య కృతహర్షప్రకర్ష మొనగూర్చెను. మం త్రీశ్వరుఁడు కవుల సత్కరించి వారల వాక్యములలో నిగూఢ ముగఁ జిత్రరూపముగ నున్న యర్థలేశము గ్రహించెను. కవీంద్ర శైలేంద్రములనుండి వెలువడిన సరస్వతీ ప్రవాహ ముల నారోహించి మంత్రీంద్ర కీర్తిహంసి సముద్ర వలయిత భూమండలమును వ్యాపించెను.

ఒకనాడు మంత్రి సోమేశ్వరగురువులు తన్ను మిక్కిలి స్తుతింప లజ్జించి తలవంచుకొనియుండ సోమేశ్వరు డిట్లనెను. “ఓ వస్తుపాలప్రభూ! నీవు వాగ్దేవీ వదనారవింద తిలకుడవు.

నీ వాక్కుడవే భువనోపకారకుఁడవన్న సజ్జనోక్తులకు లజ్జానమ్రముఖవ్యాజమునఁ దలవంచి యీ భూమియందుఁ బాతాళమునుండి బలినుద్ధరించు మార్గమును వెదకుచున్నావని తెలిసికొంటిని". మంత్రీశ్వరుఁడు వస్త్రాసనములు లక్షద్రమ్మములు సమర్పించెను.

ఒకనాఁడొక దీనుఁడగు ద్విజుఁడరుదెంచి మంత్రిని వస్త్రము కోరెను. మంత్రియాజ్ఞనొంది వస్త్రాధికారులాతని కొక స్థూలవస్త్ర మొసగిరి. అతఁడిట్లనెను. "దేవా! నాకొసగిన వస్త్రము మాదితో, సూత్రముతో, కూర్పాసముతో నీ శత్రుభార్యల కుటీరమువలెనున్నది". మంత్రి దాని నాతనిచేఁ బదునేనుమార్లు పలికించి పదునేనువేల ద్రమ్మములొసగి సత్కరించి పంపెను.

ఒకనాఁడు బాలచంద్ర కవీశ్వరుఁడు వచ్చి యిట్లు స్తుతించెను. "మంత్రీశ్వరా! నీయందు గౌరీదేవి రాగవతి. ధర్మస్వరూపము, శివవాహనమగు వృషభము బద్ధాదరము. సముల్లసద్గుణులగు ప్రమథులు నీ యాజ్ఞావర్తులు. ఈశ్వరాంశకల నీవు బాలచంద్రుఁడనగు నన్నున్నతుని గావింపఁదలచుట తగియున్నది". మంత్రి సంతసించి సకలరాజ సమక్షమున నతని నుత్సవపూర్వకముగఁ గూర్చుండఁజేసెను.

లక్ష యిరువదివేల పత్తనములకు శృంగార తిలకమగు నాగపురమందు సాధువను శ్రేష్ఠుఁడు కలఁడు. అతఁడు భాగ్యవంతుఁడు, శ్రీమంతుఁడు, మహాభక్తుఁడు. ఆ సాధువు కేశవంశీయుఁడు. అతని తండ్రి సాధుదేహ్లుఁడు. ఆతఁడు మోజదీన్

పాదుషా పట్టమహిషి కభిమాన పాత్రుడు. గజపతు లశ్వపతులు నరపతు లతనివాకిటఁ గార్యార్థులై వేచియుందురు. ఆతడు శాస్త్రవిధానమునఁ జిచ్ఛేరనగరమందుఁ దీర్థయాత్ర, స్నాత్రయాత్ర కావించి, పాదుషా యనుమతితో, రాజచిహ్నములతో, సంఘాధిపతులతో గూడి శత్రుంజయోజ్జయంత తీర్థయాత్ర కేగుచుఁ జౌళుక్యదేశ మార్గమున వచ్చి రాజధాని మార్గమువదలి మారుదోవ నేగుచున్న వార్తవిని వస్తుపాలుడు తన మనమందు "దుర్బుద్ధులు శాకముల సందేహించినట్లు సజ్జనుల శంకింతురు. సంఘీయులయ్యును రాజాధికార పురుషభయము నందవలసి వచ్చినందుకు విచారింపుచున్నా"నని చింతించి తేజఃపాలుని బిలచి 'సంఘమువారిని బిలచికొని రమ్మ'ని పంపెను. అతడు సంఘాధిపతియగు పూర్ణసింహుడు కనిపింప సంఘసమేతముగ నాతనిని రాజధానికిఁ గొనివచ్చెను.

వస్తుపాలు డూరిబయట కెదురేగి సంఘమువారి నాదరించి పూర్ణసింహు నభినందించి శ్రేయోమయాలాపము లాడి యింటికిఁ గొనివచ్చెను. మంత్రిరాజు గృహమున భోజనములు, శాకపాకములు క్షణములో సిద్ధించినవి. సంఘీయుల భోజనమునకు మండపము రత్నములతో నలంకరించిరి. కేతువులు స్థాపించిరి. చందన జలముతోఁ గలయంపి చల్లిరి. ధూపములు వైచిరి. పుష్పాలంకృతు లొనరించిరి. సంఘేశ్వరులతో గూడిన మంత్రిరాజ గృహాంగణము పవిత్ర

పూయెను. లలితాదేవి ముత్యములతో ఫలములతో సంఘీయుల నర్చించెను.

మంత్రీశ్వరు డొక్కొక్కరి పాదములు ప్రక్షాళించుచుండ వేళయగుచున్నదని తేజఃపాలుకు హెచ్చరించి మిగిలిన వారి పాదములఁ దాను కడిగెదననగా నరచంద్రగురుడు ప్రోత్సహించినను మంత్రి 'తానీ పుణ్యమున నెవ్వరికి భాగము పెట్టనని నా తల్లిదండ్రుల కోరికలు నేఁడు ఫలించిన'వని పలికి వారందరి పాదములఁ బ్రక్షాళించెను. మంత్రీశ్వరుడు సర్వసంఘాధిపతులకు నానావిధ భోజ్యములు, ఆజ్యములు సమర్పించి భుజింపజేయుచు వినయముతో శ్రీ ఖండద్రవసంస్థిక వాలవ్యజనముతో విసరుచుండెను. భోజనానంతరము వారినిఁ బుష్పమాలికలతో నానావిధ వస్త్రములతో నలంకరించెను. పూర్ణసింహుం డాధవళక్కపుర మందలి చైత్యములన్నిటి యందుత్సవములు కావింప వస్తుపాలుం డాతనికి సంఘాధిపోత్సవము కావించి యాతని నుదుట తిలక మలంకరించెను. వీరధవళ మహారాజు సంఘమువారికి వాద్యములు, ధ్వజములు, ఛత్రములు దానము లొసగి సన్మానములు కావించెను. వస్తుపాలుడు సంఘాధిపతియగుట వలన వారివెంటఁ దీర్థయాత్రల కరిగి మూలనాథుని విగ్రహము నూత్నముగ నేర్పరుపవలసిన యావశ్యకత గమనించి పూర్ణసింహునితో నాలోచించి పాదుషావలన బింబనిర్మాణ లోహ మిప్పింప గోరెను. పూనడుడు దాని కంగీకరింప మంత్రీశ్వరుడు రాజధాని కరుదెంచెను.

ఒక దినమందు రాజసభ యందున్న వస్తుపాల మం త్రీశ్వరుని దర్శింపవచ్చి యొక కవి యిట్లు స్తుతించెను. "విద్వాంసులకు దుఃఖహరుడు, పూజితసురుడు, సౌజన్య రత్నాకరుడు, నీతివరుడు, ప్రియంవదపరుడు, త్రివర్గస్థిరుడు, దానయుత కరుడు, సుదూరితదరుడు, కల్యాణవలీకాంతరుడు, ప్రీతిప్రీతనరుడు, ధర్మరుచిరుడగు మంత్రీశ్వరుడు జయించు గాక!" మంత్రి యీ పద్యానుప్రాసముల కలరి యందెన్ని యనుప్రాసములు కలవో యన్ని లక్షలాతని కొసగి భోజ రాజును గుర్తుకు దెచ్చెను.

ఒకనాడు తేజఃపాలుడు సంఘముతో భృగుకచ్ఛ తీర్థమున కరిగి, వాయడగణాధిపుల కోరికమీద సంబడ దేవ ప్రాసాదమునకు డెబ్బది దేవనాగములు, ధ్వజములు, కలశ ములు కూర్చి, సోపారకపురమందలి యుగాదిదేవు నర్చించి, చైత్యశీర్షమున బంగారు ధ్వజము ప్రతిష్ఠించి, యాచకుల కోరికల దీర్చి, చైత్యమునకు దక్షిణోత్తర పార్శ్వములందు దేవనాగములను, మూడు కాంచన కలశముల స్థాపించి స్నాత్రపీఠమందు ధాతుబింబ మేర్పఱచి నాగేంద్రాది మునీం ద్రుల లేపమయమూర్తులఁ దమగురువులచేఁ బ్రతిష్ఠింప జేసెను. పిదప నవసారిపురమునకరిగి యేబదిరెండు దేవనాగ ములు ప్రకాశించు చైత్యమేర్పఱచి, ఘనదివ్యపురమందు నేమిచైత్యమేర్పఱచి స్తంభతీర్థపురమందలి పార్శ్వనాథునకు మ్రొక్కి యనేకోత్సవము లాచరించి రాజధాని కేగెను.

ఒకనాడు మోజదీను పాదుషాతల్లి హజయాత్రార్థి నియై యోగినీనగరమునుండి స్తంభతీర్థపురమున కరుదెంచి యచ్చట రహస్యముగ నివసించుచు దైర్థికసార్థము రాక కెదురు చూచుచుండెను. ఆమె వచ్చిన విషయము గూఢ చారుల వలన మంత్రీశ్వరు డెఱిగి యాతడు తత్పురమున కేగెను. ఇంతలోఁ గొందరామె ధనము దోచుకొన నామె మంత్రికి మొరపెట్టుకొనెను. ఆతడామె కిబ్బడి ధనమొసగి పుత్రునివలె వాత్సల్యము చూపుచు గొప్ప పరివారముతో నామెను యాత్రకు గొనిపోయి యచ్చట ధర్మచక్రపద ద్వారమందు దారాసనాశ్మతోరణ మేర్పరచి మూడులక్షల ద్రమ్మముల వ్యయించి, యామెను దనయింటికి గొనివచ్చి పది దినము లుంచుకొని ముత్యాలహారము బహూకరించి యామెను గైకొని పాదుషా రాజధానికరిగి యామె ప్రార్థన మేరకుఁ దత్పరిసరమందు యుద్ధోద్ధతులగు వీరభటులతో గూడి యుండెను.

మోజదీనుపాదుషా మహోత్సవముతోఁ దనతల్లి నెదుర్కొని కొంపోయి యామెకు మ్రొక్కి "తల్లీ! మీ యాత్ర యెట్లు సాగిన"దని ప్రశ్నింపనామె యాతనితో "నాయనా! నీవు నా కుమారుడవైనట్లు నన్ను వస్తుపాల మంత్రి తల్లివలెఁ బూజించి యాత్రకావింపజేసి కొనివచ్చి నాడు. శ్రీమంతుడు, సుధీవరుడు, సర్వకార్య సమర్థుడు, సకలప్రాణి సహాయకుడు, సుకృత తరువులకు వసంతుడు, చాళుక్యరాజ మంత్రి వస్తుపాలుడు ధర్మపుత్రునివలెఁ బవి

భక్తుడై యనన్య కృతితత్పరుడై యుండెను. ఆతడు నా యందుఁ జూపిన భక్తి వర్ణింపజాల''నని పలికి మంత్రి బహూకరించిన తారహారమును జూపెను. మోజదీను తల్లితో “నమ్మా! ఆ గుణోదధి నేల కొనిరావైతి''వన నామె తా నాతనిని గొనివచ్చి పురపరిసరమున నిలిపిన విషయ మెఱుగ జేయ వస్తుపాలుని గొనివచ్చుటకు పాదుషా బయలుదేరెను.

నీతి బృహస్పతియగు మంత్రి పాదుషా రాక గమనించి సర్వసన్నద్ధుడై యుండెను. ఆ క్షణమందు పాదుషా ఘూర్ణసింహునిఁ బంప నాతడరుదెంచి వస్తుపాలుని మోజదీను కడకు గొనిపోయెను. వస్తుపాలుడు పాదుషాకుఁ బది యేనుగలు, నూఱు గుఱ్ఱములు, మాణిక్య పతకము బహూకరించెను. మోజదీను మంత్రినిఁ గౌగలించుకొని మిక్కిలి గౌరవించెను. మంత్రి పురమున నింట నెనిమిది దినములుండి దాన మానాదులతో రాజమండలము గౌరవించుచు నా నగర పరిసరమున గోమయాకారముగ నర్హతులకుఁ జైత్యమును మోజదీను ననుమతితో నిర్మించి చక్రేశ్వర మహాదేవి విగ్రహము నిలిపి సమ్మేతశిఖరమునుండి వజ్రబింబము తెచ్చి స్థాపించెను. పాదుషా దేవీపూజకు మంత్రిమీఁది గౌరవమున శాకమండలికా గ్రామమొసగెను.

మంత్రి తిరిగివచ్చు సందర్భమందు పాదుషా వస్తుపాలుని కోరిక నెట్టిదైనఁ దీర్తునని బలవంతపరుప మంత్రి యాతనితో “రాజా! మీరు నాయందు వీరధవళునివలె వాత్సల్యము చూపించుచున్నారు. ఐదు పాషాణములు

మహాన్మోక్షముల నొసగు" మని ప్రార్థింప మోజదీను స్మిత స్మేరాననుడై పూజనుని సమ్మతిగొని మంత్రికోర్కె దీర్చి సాగనంప బయలుదేరి గోపగిరి చేరఁబోయెను.

మంత్రీశ్వరు డచ్చట నా మహీపతి నిర్మించిన జిన మూర్తి నర్చించి లక్ష ధనము వ్యయించి స్నాత్రోత్సవము కావించి చైత్యశృంగమందు దండమండిత హేమకలశ ముంచి, యామసరోవర ప్రాంతమందు శాంతినాథ జిన మందిరము ధాతుబింబముతో నేర్పరచి, నాగపురముచేరి యా రాజశత్రువుల సంహరించి, యచ్చట రెండు సత్రము లేర్పరచి, పార్శ్వనాథ మందిర మిరువదినలుగురు తీర్థేశ్వరుల ప్రతిమలతో నిర్మించి పూర్ణసింహుని సాగనంపి, చిత్రకూటముచేరి కోటి ధ్వజములు గల జినాగారమును బర్వతోపరిభాగము నం దేర్పరచి, చంద్రాంశు నిర్మలమగు చైత్యము పర్వతమేఖలా ప్రదేశమం దేర్పరచి పూజాదులు కావించెను. కపిలకోట్టరాజగు కాలపౌరుషుని నిస్స్వానస్వానములతో నుద్రేకింపజేసి యోడించి కోటిద్రమ్మములఁ బరిహారముగ గైకొనెను. నాగహ్రదాది తీర్థములందు చైత్యములు, శైవాలయములు, ధర్మశాలలు, మఠము లేర్పరచుచు, వాపీ కూప సరోవరములఁ ద్రవ్వించుచు, సత్రముల నిర్మింపజేయుచు మార్గమందలి జనుల నానందపరచుచు, నగర పత్తనముచేరి జ్ఞాతులను కుటుంబము నాహ్వానించి శ్రీ వర్ధమాన సురీశ్వరులవద్ద శంఖేశ్వరతీర్థ మాహాత్మ్యము విని

శంఖేశ్వరతీర్థమున కేగి పార్శ్వనాథునకు స్నాత్రోత్సవము కావించి, చైత్యముద్ధరించి కలశము లలంకరించెను.

మహామాత్య వస్తుపాలుడు రాజధానిని జేరి వీరధవళు నానందింపజేసి యోగినీనగర వృత్తాంతము రాజాజ్ఞచే విన్న వించి మహారాజొసగిన లక్ష హేమములు గ్రహించి గృహము చేరి కవులను దీనులను సత్కరించి, పౌరులానందముతోఁ దెచ్చిన కానుకలు కైకొని వారిని సత్కరించి సాగనంపెను. భట్ట సోమేశ్వరాది కవులు వస్తుపాలు నిట్లు స్తుతించిరి. "వస్తుపాల మంత్రీశ్వరుడు కల్పతరువులతో స్వర్ణగిరిదుర్గము నిర్మించెను. కామధేనువు పాతాళమున కేగెను. చింతామణి సముద్రములోని కేగెను. ఈ కాలమందు యాచకులనుజూచి వస్తుపాలేతరుడెవడు దానైకవీరుడై ప్రకాశింపగలడు? ఓ వస్తుపాలా! యొక ద్విజరాజునుజూచి శ్రీమంతములగు పద్మ ములు సంకోచించుచున్నవి. లక్షలకొలది ద్విజరాజులు వచ్చి నను నీ పాణిపద్మము సదా వికాసవంతమైయున్నది. నీవద్ద శత్రువుల యుచ్చాటనమునకు, రమాకర్షణమునకు, స్వామి వశ్యమునకు సిద్ధమంత్ర మున్నట్లున్నది". మంత్రీశ్వరుడు వారిని యథోచితముగ సన్మానించెను.

ఒకనాడు పూర్ణసింహుడు మంత్రియింటి కత్యుజ్వల దళములఁ బంపెను. కర్పూరపూర గౌరాభములగు నాయైదు దళములఁ జూచి చంద్రునిఁజూచిన చకోరమువలె మంత్రి సంతసించి విగ్రహ నిర్మాణమొనరింప నాజ్ఞాపించెను. మం త్రీశ్వరుడు శ్రీ నాగేంద్ర గణాధీశ్వరుల వలన శ్రీ స్తంభ

తీర్థమందున్న జగచ్చంద్రమునుల ప్రభావ మాలించి వారికి మ్రొక్కఁదలచి సంఘసమేతముగ నచ్చట కరిగి వారికి మ్రొక్కెను. వారి వలన నుపదేశమంది తిరిగివచ్చి నాగేంద్ర మునులవలన పంచమీ వ్రతమహాత్మ్యము విని వ్రత మాచరించి నుద్యాపన సమయమున రత్నములతో, స్ఫటికములతో, వైడూర్యములతో, హేమముతో నైదైదు వేర్వేరు ప్రతిమలు చేయించి స్థాపించెను. పంచ ధర్మశాలలు, సోమకలశములు గల పంచతోరణములు నిర్మించెను. పన్నెండుకోట్ల ద్రమ్మములు వెచ్చించి షణ్మత గ్రంథములుగల భారతీకోశముల (గ్రంథాలయముల) నేర్పరచెను. గ్రంథములను పంచ మాణిక్యములతో నర్చించి, పంచార్హతులకు పంచవర్ణాసనము లొసగెను. శ్రావకులకు పంచ లక్షలు, పంచ కోట్లు ధనమొసగి వారిని పంచలక్షాధికారులుగ, పంచ కోటీశ్వరులుగ గావించెను. జినమునులకు పంచమణి స్వర్ణమకుటము లలంకరించి, యర్హతుల ఫాలములందు పద్మరాగమయ తిలకము లలంకరించెను. పంచపంచ శ్లాఘ్యవస్తువులతో, నితర సద్వస్తువులతో, నిజశక్తితో భక్తినిఁ బ్రదర్శించుచు జినార్చన మాచరించి సంఘమువారికి, మునులకు గౌరవములు కావించెను. మంత్రీశ్వరు డిట్లు సద్భక్తితోఁ బంచమ్యుద్యాపనము కావించి, యర్హతుల పిలిపించి రాజుల సమక్షమందుదయప్రభ సూరులకు శ్రీ నాగేంద్ర గణాధీశ్వరులచే సన్మానములు కావింపజేసెను. ఆ యుత్సవములు చూడ దలచి మూఁడు వందలమంది సూరులు సంఘములతో వచ్చిరి.

మంత్రి సంఘపూజన మాచరించి, భుజింప జేసి, పంచవర్ణ దుకూలములతో గౌరవించెను. రాజమండలిని రత్నాలంకారములతో, యాచకులను దానములతోఁ దృప్తిపఱచి పుర చైత్యములందు ధ్వజారోపణములు కావింప జేసి తమ గురువుల నర్చించి యిరువది నలువురకు నాచార్యోత్సవములు కావించి యాచార్యపదవి యందు ప్రతిష్ఠించెను.

ఇంతలో నొక కవివచ్చి "వస్తుపాలుని సంపదలను బండితు లనుభవించుచున్నారు. దేవతలు పారిజాతవాసనల నూఘ్రాణించుచున్నా"రని స్తుతింప నాతనికిఁ బదివేల కనకాసనము లొసగి పంపెను.

ఒకనాడొక కవి వచ్చి "మంత్రీశ్వరా! కలియుగ మందుఁ గవులకు సహజముగ స్నేహము సాధువులందే కాని భోజనమందు లేదు. నివాసము కుటీరములందే కాని దేహావరణమందు లేదు. పద్మము నేత్రములందే కాని కోశములందు లేదు. అర్థము కావ్యములందే కాని కరమందు లేదు. వృత్తి పఠనమందే కాని జీవన విధియందు లే"దని విన్నవింప మంత్రి యాతనికి మూఁడు లక్షల ద్రమ్మములు, మూఁడు లక్షల వస్త్రాసనము లొసగెను.

ఒకనాడు మంత్రి సముద్రప్రాంతమున కేగి యాన పాత్రలనుండి యీవలకు గొనిరాబడుచున్న గుఱ్ఱములను జూచుచుఁ దన వెంటనున్న కవుల కీసమస్య నొసగెను.

'ప్రావృట్కాలేప యోరాశిః కథం గర్జితవర్జితః'
(వర్షాకాలమున సముద్రము గర్జలవర్జించి యున్న దేల?)

సోమేశ్వరకవి దానినిట్లు పూరించెను.

'అంతస్సు ప్తజగన్నాథ నిద్రాభంగ భయాదివ'

(తనయందు పరుండి నిద్రించుచున్న విష్ణుదేవునకు నిద్రా భంగమగునను భయమువలన సముద్రము గర్జనలుమానినది)

మంత్రీశ్వరుడు సోమేశ్వరకవికిఁ బదునారు జవనాశ్వము లను, బదునారువేల బంగారు నాణెములనొసగి సత్కరించెను.

మరియొక కవి వస్తుపాలు నిట్లు స్తుతించెను. "శ్రీ వస్తుపాలునకు స్వస్తియగు గాక! లోకులకు కల్పతరు వని పించుకొన్న భోజమహారాజు నేడులేడు. ఆర్తులు, ఆధి వ్యాధిపీడి తులగు ప్రజల నీ వస్తుపాలుడే కాపాడవలయును".

మంత్రి యాకవికి లక్షద్రమ్మములొసగి తాను లోకుల మేలుకొరకు ప్రతి సంవత్సరము కోటిద్రమ్మములు వ్యయిం తును. ధాతువులందు బంగారము పేరొందినట్లు దానము లందు దయాదానము పేరొందియున్నదని నిత్యము దాన ములు చేయ నిశ్చయించుకొనెను.

వస్తుపాలుడిట్లు నిశ్చయించుకొని సంతోషపూర్వక ముగా దానములు కావించుచు లోకుల నుద్ధరించుచుఁ జౌళుక్య రాజ్యభారము వహించుచుండెను.



ఒకనాడు మంత్రీశ్వరుడు నాగేంద్ర గురువులవలన "వైశ్య వంశాలంకారుడగు విమలదండనాథుడు సంతానము

కెన్న చైత్య మధికమని తలచి సుప్రసన్నయగు దేవితో తనయు నీయవలదు. చైత్యము నర్బుదపర్వతమందు నిర్మించునట్లనుగ్రహింపు మని ప్రార్థించి విమల చైత్యము నేర్పరచిన వృత్తాంతమును, నర్బుదగిరి మహిమము నాకర్ణించి తానును తనమనమందు "మేము నలువుర మన్నదమ్ములము. బాల్యమందే యిరువురు సోదరులు మరణించిరి. మల్లదేవుని శ్రేయముకోరి శత్రుంజయమందు నష్టాపద తీర్థము నిర్మించితిమి కాని లూణిగుని శ్రేయము విస్మరించితిమి. అర్బుదగిరి యందు లూణిగుని పేరం జైత్యము నిర్మించెదంగాక" యని నిశ్చయించుకొని గృహమునకేగి తేజఃపాలున కీవిషయము తెల్పి యాతని కాప్రయత్నములు కావింప నాజ్ఞనొసగెను.

తేజఃపాలుడు ధారావర్షరాజును దర్శించి యాతనితోగూడి యర్బుదగిరి నారోహించి యచ్చటి మునుల యనుమతితోం జైత్య నిర్మాణ ప్రయత్నములు కావించి సోపానము లేర్పరించి, యుభయ పార్శ్వములం దంగడుల క్రోశమున కొకటివంతున నైదుయోజనముల దూరమువరకు స్థాపించి కూర్మ చక్రము బలిపీఠము దృఢముగ బంధింపం జేసి, చంద్రావతి కేగి చంపకవణిజుని జూచి యీ చైత్య నిర్మాణ ప్రయత్నములం బరిశీలించుచుండుట కనుమతింపజేసి రాజధానికేగి సోదరునకు సకల విషయములు తెల్పి పూర్ణసింహుడు పంపిన దళములతో విగ్రహము సిద్ధమగుట తెలిసికొని తిరిగివచ్చి పనులు మాంద్యముగ జరుగుటకు విచారించి యనుపమాదేవితో నాలోచించి పనివాండ్రకుం

బరిచారకులను, క్షీరములను, శాకపాకములను నమరించి పనులు తొందర తొందరగాఁ జేయించి రాజధానికేగి సోద రునకు సర్వవిషయములు తెల్పెను.

వస్తుపాలుడు వీరధవళునితోబాటు బయలుదేరి కుటుంబములతో వచ్చెను. అతని వెన్నంటి జవాళిపుర స్వామి, చంద్రావతిరాజు, నద్దూలరాజు గ్రామాధికారులు పురాధికారులు, నుదయసింహుని మంత్రి యశోవీరుడు, మహాజనులు, శ్రావకులు, విజయసేన సూరులు, సాధువులు సాగివచ్చిరి. శ్రావకులు ప్రతిష్ఠా సామగ్రిని సమకూర్చిరి. పుణ్యానదీ జలములు, స్నాత్రయోగ్య వస్తువులు, బంగారు పట్టములు, శలాకలు, రత్నములు, కస్తూరి, ఘనసారము, శ్రీఖండము, భోజ్యవస్తువులు, ఫలములు, ధూపనీపములు, పంచ గవ్యములు, పంచవర్ణ పుష్పరాసులు, పంచరత్న ములు, కుసుంబాంబరములు, మూడువందల యరువది మూడు త్రయాణకములు, గోరోజనము, ప్రియంగువు మొద లగు వానిని సేకరించిరి. మంత్రీశ్వరుడు శ్రావకుల చేతు లకు రత్నగాంగేయ కంకణము లలంకరించెను. లలితా నుపమా సౌఖ్యలతాది పుణ్యకాంతలు ప్రతిష్ఠా గీతములు పాడుచు వచ్చిరి. ప్రతి ప్రతిమాశీర్షము లందర్హాతులు హేమాతపత్రములు, పార్శ్వములందు చారుచామరము లలంకరించిరి.

ఇట్లు సానుజుడగు మంత్రీశ్వరుడు బింబములఁ బ్రతి ష్ఠింపజేసి పర్వతశిఖరములందు హేమ కలశము లేర్పరిం

చెను. ఉత్సవములు చూచి దేవతలు కుంకుమ జలములు వర్షించిరి. చైత్యమంతటను, దేవనాగము లంతటను, ధ్వజములఁ బ్రతిష్ఠించి మంగళదీపము లుంచిరి. అర్హాతులను భుజింపజేసిరి. ప్రజలెల్లరు యథేష్టముగ పంచభక్ష్య పరమాన్నము లారగించిరి. లలితానుపమా దేవులు యతుల కన్న పానాదు లొసగిరి. మంత్రీంద్రులు వీరధవళాది రాజులకు, యశోవీరాది మంత్రులకు దివ్యరత్నాలంకారములు బహూకరించిరి. అర్హాతులకు పంచవర్ణ దుకూలములిచ్చి యాచకులకు దానముల కిరువది రెండు లక్షల ధనము వ్యయించిరి.

వస్తుపాల, తేజఃపాల, యశోవీరమంత్రు లొకచోఁ జేరి ముచ్చటించుకొనుచుండ వస్తుపాలుడు యశోవీరుని గుణము లభినందింప నాతడు హృష్టచిత్తుడై మంత్రీశ్వరుని ప్రస్తుతించెను. తేజఃపాలుడు యశోవీరు నభినందించెను.

మంత్రి సర్వరాజ సమక్షమందు చైత్యపూజాది వ్యయస్థితి కావింప సోమసింహుడు దేవాడికా గ్రామము, వీరధవళుడు భుండపద్ర గ్రామము చైత్యపూజ కొసగిరి. తేజఃపాలుడు శంఖోజ్జ్వల శిలలతో నేమిప్రభుని మందిర మేర్పరచి, యేబది రెండు జినవరావాసారములుగల మంటపము నెమరుగను, పార్శ్వమందు బలానకము నేర్పరించెను. మందిరమందు తోరణములు, వారణఘటలు, నానామండపములు కలవు.

మంత్రిసోదరులు నానా సంఘముల సాగనంపి శ్రీమత్పత్తనమందు పంచాసర పార్శ్వనాథు నర్చించిరి. వస్తు

పాలుడు అర్బుదగిరియం దచలేశ్వర మంటపము నిర్మించి మాతృసదనము నుద్ధరించి, మల్లదేవఖ్యాతము నేర్పరచెను. తేజఃపాలుడు లూణిగుని శ్రేయముకోరి కైలాసము కన్న సున్నతము, మలయముకన్న సురభిళము, మేరువుకన్న తుంగ శృంగము, హిమాచలముకన్న శీతలమగు నేమిజినేంద్ర మందిరము నిర్మించెను. మంత్రులు రైవత దైవతమందిర ములు నిర్మించిరి. వస్తుపాలుడు నాలుగు సానువులు నిర్మించెను. చండపుడు, చండప్రసాదుడు, సోముడు, అశ్వరాజు, లూణిగుడు, మల్లదేవుడు, జైత్రసింహుడు, లావణ్యసింహు డనువారి ప్రతిమలతోపాటు తమ యిరువురి ప్రతిమల మంత్రి సోదరు లేర్పరచిరి. ఇచ్చట ప్రతిదినము రంగమంటపమందు నాట్యప్రతిమా నాట్యములు సాగుచుండెను. మంత్రీంద్రులు రాజధానిచేరి సుఖముగ నుండిరి.

ఒకనాడొక కవిరాగా మంత్రీశ్వరుడు కూర్చుండు మనెను. అతడు 'మహామాత్యా! యిచ్చట స్థానము లేదు. నేనెచ్చట కూర్చుందు'ననెను. మంత్రి 'యిచ్చట స్థలమేల లే'దన నాతడు "అన్నపాన, పయఃపాన, ధర్మస్థానముల వలన గలిగిన నీకీర్తి భూమ్యాకాశముల నిండియుండ నే నెందుఁ గూర్చుందు"ననెను. మంత్రి యాతనిని మరలఁ బలుకుమనగ నతడు పల్కెను. ఇట్లు మంత్రి మరలమరల నడుగ నాతడేడు మార్లట్లే పల్కి యూరకుండెను. మంత్రి యాతని కదృష్టమింతేనని తలచి యేడుమార్లు పలికినందున నేడు లక్షల ద్రవ్యము నేడు వర్షాసనములొసగి పంపించెను.

ఒకనాడు మంత్రీశ్వరుడు స్తంభతీర్థ పురమునకేగి శ్రీ దేవేంద్రమునీంద్రుని వలన వింశతి స్థానతపో మాహాత్మ్యము విని తిరిగివచ్చి యా తప మాచరించి, యుపవాసములు కావించి యుద్యాపనము కావించెను. కర్ణావతి మొదలగు పురములందు నిరువది చైత్యములు నిర్మించి, పంచవర్ణ ప్రతిమల స్థాపించెను. ఇరువది నలువురు తీర్థేశ్వరుల చరిత్రముల రచింపజేసెను. ద్వాదశీ వ్రతసంయుక్తులగు నిరువది మంది శ్రావకులను ద్రమ్మ లక్షలతో నర్చించెను. చతుర్దశ మహాపర్వములం దుపవాస వ్రతము నాలుగేండ్లు నెరపి వైభవముగ నుద్యాపన మాచరించెను.

ఒకనాడొక కొండెగాడు వీరధవళునితో "వస్తుపాలునింట నతిథుల కుచ్ఛిష్టభోజన మొసగబడు" చున్నదని చెప్పెను. రాజు నుండిపడి "తలనొప్పిగా నున్నది. సభకు రానే"నని వర్తమానము పంపి మారువేషముతో మంత్రీశ్వరు నింటికిబోయి సౌఖ్యలత భోజనము వడ్డించుచుండ, లలితాదేవి నేయిపోయుచుండఁ బరిసర మునులను గమనించుచు భుజించుచుండెను.

అనుపమాదేవి సాధువులకు నేయివడ్డించుచు నొక సాధువుపాత్రలో నేయి వడ్డించుచుండ పాత్రనిండి నేయితొణకి యామె వస్త్రము తడియుచుండెను. ఆ సాధువు విషయ మెఱిగింప నామె "దేవా! మేము వీరధవళమహారాజు సేవకులము. భిక్షుకుల వస్త్రములమీద, మా వస్త్రములమీద నేయిపడిన దానగల్గు పుణ్యము మాది. మిగిలినదెల్ల రాజేం

ప్రమనిది. నేనొక జన్మమందు కాంచనవికాలయమునఁ బరిచారికగ జన్మించి నికృష్టజీవినై పురాకృతసుకృతము వలన జినులకు వడ్డించిన నేయి నా వస్త్రముమీఁదఁ బడినందున నిట్టిజన్మ మందితిని. శ్రీ వీరధవళుని ప్రసాదమువలన మాకు విశ్వాతిశాయి సంపదలు కలవు. మేమూ రాజు సేవకులము. నానా సత్కార్యములతో నాతని కీర్తిని విస్తరింపజేయుచున్నాము. సత్ క్షేత్రము, సత్కుల జననము, సదాచారము, సంపదలు, సౌభాగ్య దన్ననుడగు రాజు సామాన్య పుణ్యము వలన లభింప”కని వచియించెను.

సరస్వతీదేవి వంటి యనుపమాదేవి వాక్యములు రాజువిని యామె రాజభక్తి కచ్చెరువంది, భుజించి శౌచస్నాన తాంబూలము సేవించి, చందన మలదుకొని వెంబడివారి వలన నామెను తేజఃపాలుని భార్యగా దెలిసికొనెను. ఇంతలోఁ బరిచారకులు రాజును గుర్తించి పోయి మంత్రులను గొని వచ్చిరి. మంత్రులు రాజు నర్చించి రాజునకు పంచ రత్నాభిధవాజి రత్నమును రత్నావళినిఁ గానుక నొసగిరి. రాజు వారి నభినందించి యంతిపురి కరిగెను.

ఒకనాడు వీరధవళుడు నింకుకొలువుండి వస్తుపాలునితోఁ బ్రస్తావోచితముగ నిట్లనెను. “మంత్రీశ్వరా! నాకన్న నీవధికముగ వ్యయించుచున్నావు. అనుదినము కోట్లకొలదిగ ధనము వ్యయించుచున్నావు. లోకమందన్ని విధములైన బలముకన్న ధనబలమే గొప్పబలము. ఆబలములేని గృహస్థుడు సమర్థుడయ్యును దృణకల్పుడగు చున్నాడు. ధనవంతుడు

గుణహీనుడైనను లోకు లతనిని గుణవంతుడందురు. ఒక కవి లక్ష్మీదేవినిట్లు స్తుతించియున్నాడు. "తల్లీ! నీ ప్రసాదము వలన దోషములు గుణములగుచున్నవి. ఆలస్యము స్థిరత్వము గను, జాపల్యము ద్యోగితగను, మూగతనము మితభాషిత గను, మౌర్ఖ్యము ఋజుతగను, పాత్రాపాత్ర విచారణా శూన్యత యౌదార్యముగ మారుచున్నది". కావున నో వస్తుపాల మంత్రీశ్వరా! నీవి యధిక వ్యయము మానుకొన వలసినది". మంత్రీశ్వరుడు మహారాజుతో "దేవా! నే నెచ్చట ధర్మస్థానము కావించినను నిధులు కలుగుచున్నవి. నా ఫాలచ్ఛాయపడిన చోటనెల్ల నిధిలభించి తీరు"నన రాజు విస్మితుడై యాసభాభవనమందుఁ బనివారలఁ బిలిపించి వస్తుపాలుని సమీపమందుఁ ద్రవ్వింపఁ గపర్దియక్ష సాన్ని ధ్యమువలన నా క్షణమందచ్చట నిధి యుదయించెను. రాజది కాంచి వస్తుపాలుని భాగ్యమును బహుధా ప్రశం సించెను.

శ్రీ వస్తుపాలు డొకనాడు పుండరీకాద్రియందుఁ గపర్దియక్ష మందిరము నిర్మింపజేయఁ బ్రజలా ప్రదేశమున నిధియెట్లు లభించునో చూతమనుకొను చుండ నొక కాల సర్పము బుసకొట్టుచు నటకు వచ్చెను. ప్రజలది చూచి చెల్లా చెదరైరి. మంత్రికిమాత్ర మా పాము రత్నావళిగఁ గన్పింప నాతెడు దానిని గ్రహించి ప్రజల విస్మితులఁ గావించెను. అంత నమాత్యుడు కపర్దియక్షు నిట్లు స్తుతించెను. "చింతా మణి కల్పవృక్ష కామధేనువులను స్వప్నమందైన లెక్కిం

పను. అధీతగుణాతిరేక నిధియగు కపర్ది నహర్నిశము సేవింతును".

ఒకనాడు నైరిసింహుడను సత్కవి శిరోమణి వస్తుపాలుని దానలీల నాకర్ణించి చూడవచ్చెను. వస్తుపాలు డాతని నివాసము ప్రశ్నింప నతడు దేవపత్తనమనెను. మంత్రి 'కవీశ్వరా! ఆ పురమందలి పార్వతీ పరమేశ్వరులు సుఖసాగర మగ్నులై యున్నారా"? యని ప్రశ్నింప నా కవి తాత్కాలిక ప్రతిభోత్పన్నముగ నిట్లు వృత్తము వినిపించెను.

"శివుడు:-దేవీ! నా మనస్సునందున్న లోకోపకారి నెఱుగుదువా?

పార్వతి:-దాని కేమి? శీతకిరణుడు.

శివుడు:-కాదు. ఈమారైన సరిగజెప్పి నాచుంబనము బహూకరణముగ గొనుము.

పార్వతి:-ఆఁ కల్పవృక్షము!

శివుడు:-ఏమీ! దేవివారికి ఫలభ్రాంతి జనించినదే? ముద్దుబిడ్డ వినాయకుని స్వభావము నీలో మేల్కొన్నదా?

పార్వతి:-'ఏమా నోటిదుడుకు? ఎవరు మీ మనస్సులో నున్నారో? అయినచో పర్జన్యుడు'.

శివుడు:-నీ తెలివింతేనా? చెప్పలేవా?

పార్వతి:-మీరు బొంకుచున్నారు. చందనుడా?

శివుడు:-ఇదే చివరి యవకాశము! ఈమారు సరిగఁ జెప్పెదవా? ఓటమి నొప్పుకుందువా? తేల్చుకొనుము.

పార్వతి:-ఓహో! వస్తుపాల మంత్రీశ్వరుడు!

శివుడు:–దేవివారికిఁ దలతిరిగి కబళము నోటికివచ్చినట్లు చివరకు వచ్చినది? ఇంతకు నొకనాడు బ్రాహ్మణ పుత్రికవు కదా! మీ నాన్న దక్షుడు కదూ!

పార్వతి:–ఔనిండు! మీరు వృద్ధులు. మీకు బుద్ధి చెడతల నుండును. విప్రాఃపశ్చిమ బుద్ధయః అన్నట్లు 'నేను తలతిక్కదాననే?

ఇట్టి పార్వతీపరమేశ్వరుల ప్రణయకలహ సంభాషణలు మిమ్ము కాపాడునుగాక!

వస్తుపాలుడు వైరిసింహునిచే మువ్వూరు చదివించి మూడులక్షల ద్రమ్మములు సత్కరించి సాగనంపెను.

ఒకనాడు లలితాదేవి నమస్కార ఫలమను వ్రతము కావించి యుద్యాపనము కావింపదలచి ప్రథమవలయమందు రత్నములు, ముత్యములు సమర్పించెను. ద్వితీయ వలయ మందు నరువదెనిమిది రత్నములు, తృతీయ వలయమందు గోమేధికములు, నాలవ వలయమందు ద్వాదశవ్రతులకు వైడూర్యములు, పంచమ వలయమందు నిరువదేడు మరకత ములు, నారవ వలయమందు ఫలములు, మోదకములు, భోజ్యములు సాధువుల కొసగెను. జైత్రసింహుడు చైత్యము లందారాత్రికోత్సవము కావింపించి మంగళదీపములు వెలిగిం చెను. ఆమె శ్రీ సంఘమందు వాత్సల్యముచూపి యరువ దెనిమిది వేవురు శ్రావకులకు, పదునొకండు వందలమంది సాధువులకు వస్త్రదానము కావించెను.

ఒకనాడనుపమా సౌఖ్యలతా దేవులు నందీశ్వరద్వీప చైత్యారాధన మాచరించిరి. శ్రీ దేవగురు సంఘపూజనము లాచరించిరి. వారు ఏబదిరెండు ప్రతిమలు, శరణములు, దంత సింహాసనము, రత్నమాణిక్య బింబములు, అర్హాత ప్రతిమలు నేర్పరచిరి. ఆశావల్లిపురమందు నందీశ్వరావతార చైత్యము చంద్రకాంతములతో నిర్మింపజేసి కాంచనకలశము లుంచిరి. సకల విధాన్నములు, ధాన్యములు దేవునెదుట నుంచిరి. జినేంద్రులకు రత్నతిలకము లలంకరించిరి. మంత్రీశ్వరులు సంఘము మేలుకోరి చైత్యములందు స్నాత్రోత్సవములు, ధ్వజారోహణములు, ఆరాత్రికములు, మంగళ ప్రదీపములు కావించిరి. శ్రావికా శ్రావక శ్రేణులకు దుకూలము లొసగిరి. నమస్కార మహామంత్ర జపపురస్సరముగ కోటితండుల ముక్తాఫల సంయుక్తముగ నూరు భాగములు కావించి నూరునూరు ఫలములు దానము కావించి, బంగారు పాత్రలలో దీపములు వెల్గించిన శత్రుంజయావతార ప్రాసాదమందు ధ్వజప్రతిష్ఠలు కావించిరి.

శ్రీ వీరధవళునకు విశాలుడను పెద్దకొడుకు, వీరముడను చిన్నకొడుకుండిరి. ఒకనాడు వీరముడు సిరికచెట్టువద్ద నుండ నొక ధార్మిక వైశ్యుడు ఏకాదశీవ్రతము కావించుచు బంగారు నాణెము లాచెట్టుక్రింద ప్రతిష్ఠించుచు నాతనికి నారు ఫలము లొసగెను. రాజనందనుడనగు నాకు నీడిచ్చువాడా యని మండిపడి యాతనిమర్దింప వాడు మంత్రీశ్వరుని శరణు జొచ్చెను. మంత్రీశ్వరుడు వీరమునికి బుద్ధిగరపినను వాడు

వినక మంత్రిపై నీర్ష్యవహించెను. మహారాజీ విషయము తెలిసికొని కుమారుని బిలిపించి నిందించి రాజ్యమునుండి బహిష్కరించెను. వాడేదో చెప్పబోవ రాజు మండిపడి "రాజులకు జంగమ ధనకోశమువంటి వణిజుల బాధించితివి. నాను న్యాయాధారులు. నానాదాయ విధాయకులు. వణి జుల యభిమానము నార్జించిన రాజు ధనహీనుడయ్యును ధనవంతుడగుచున్నాడు. ఇతరు డీపనిచేసియున్న శిరచ్ఛేదన మొనరింపజేసెడి వాడను. నీవు కావున రాజ్యత్యాగశిక్ష విధించితిని. ఇక్కడనుండి వెడలిపొ"మ్మనెను.

వీరముడు దురపిల్లుచు మంత్రులపై విరోధము వహించి యొకచోటకేగి సరఃకూపవాపీ నిర్మాణ మొనరించి వీరమ గ్రామము నేర్పరచియుండి దుష్టపార్థివ పరివేష్టితుడై కంసునివలె తండ్రికి బాధాకరుడాయెను.

విశాలదేవుడు యువరాజై ప్రజానంద మొనరించు చుండ ఒకనా డాకస్మికముగ వీరధవళుడు వ్యాధిపీడితుడై మరణించెను. వీరముడు చూచిపోవు వ్యాజముతో సకలసేన లతో వచ్చి రాజ్యమాక్రమింప యత్నించెను. మంత్రి సైని కులతో గజాశ్వస్వర్ణకోశముల రక్షించుచుండ తేజఃపాలుడు సింహద్వారమునందుండెను. వీరముడేమియు చేయలేక వెను దిరిగి పోయెను.

రాజు మరణమువలన లోకము శోకమయమాయెను. అంతఃపురాశ్రుధారలు సామంతులు, మంత్రుల ముంచి వేసెను. రాజుతోబాటు శుద్ధాంతస్త్రీలు, సేవకులు చితి

నారోహించిరి. వస్తుపాలుడు చితినారోహింపబోవ పూజ్య వృద్ధులతని నా ప్రయత్నమునుండి రాజ్యక్షేమమునకై మర లించిరి. మంత్రి సగద్గదముగ నిట్లనెను. "ఋతువులువచ్చి పోవుచున్నవి. కాని రాజమరణమువలన హృదయమును నిదాఘము, నేత్రములను వర్షాకాలము విడువకున్నవి. రాజు పుణ్యముకోరి వస్తుపాలుడు దానధర్మములకు కోటి సువర్ణ ములు వ్యయించెను.

వస్తుపాల మంత్రి విశాలదేవునకుఁ బట్టాభిషేక ముహూర్తము నిశ్చయించి యెల్లర నాహ్వానించెను. సోమే శ్వర గురువు శాంతిక మంగళముతో విశాలదేవు నభిషేకిం చెను. వస్తుపాలుడు రాజ్యరక్షణ మాచరించి తేజఃపాలాది సేనలతోగూడి విశాలదేవుని ప్రోత్సహించి వీరమునిపై దండయాత్ర కావించెను. వీరముని మేనమామ మేనల్లుని సాయమునకై రాగా తేజఃపాలుడా మర్జయుని క్షణములో సంహరించెను. వీరముడు పారిపోయెను. వీరమున కాతని మామ కొన్ని గ్రామములొసగెను. వీరముడు రాజ్యపీడకుడై ప్రజల దోచుకొనుచుండ బ్రజలాతనిని జంపివైచిరి.

విశాలదేవుడు వస్తుపాలమంత్రి ప్రభావము వలన రాజులనెల్లర గెలిచి కప్పములు గైకొనెను. శుక్ర బృహస్ప తులతోగూడిన దినరాజువలె విశాలదేవుడు వస్తుపాల తేజః పాలురవలన శోభించెను. వస్తుపాలుడు వీసలునిపేర నొక పురము నేర్పరచెను. రాజా పురమునకు ధర్మస్థానము లేర్ప రచి చుట్టు ప్రక్కల పన్నెండు గ్రామములు ధర్మవప్రులగు

విప్రుల కొసగెను. తేజఃపాలుడా గ్రామమందు వీరధవళుని శ్రేయముకోరి బ్రహ్మప్రాసాద మేర్పరచెను. అది జగము సౌందర్యము మించినది. గజములు, తురగములందు చిత్రింప బడియున్నవి. తేజఃపాలు డచ్చట వర్ధమాన చైత్య మేర్పరచెను.

శ్రీ కర్ణవంశీయుడు, డాహల దేశ రాజగు నరసింహుడు వీసల దేవునకు సామంతుడయ్యు సామంతులలో విభేదములు కల్పించుచు మంత్రి హితవచనములనైన లెక్కింపకుండెను. ఆతడు వీసల దేవునిపై దండెత్తి రాగా వీసలుడు భయపడెను. మంత్రి ధైర్యముచెప్పి తేజఃపాలు నాతనిమీదికి పంపెను. తేజఃపాలు డాతనిని జయించి యుద్ధాపరాధముగ లక్ష సువర్ణము లాతనినుండి కొనిరాగా రాజు సంతోషించి యా లక్ష సువర్ణములు తేజఃపాలునకిచ్చి గౌరవించెను. తేజఃపాలుడు వస్తుపాలునితోగూడి రాజ్యభారము జైత్రసింహున కప్ప గించి తీర్థయాత్రలు కావించి యా లక్ష సువర్ణములు వ్యయించెను.

సంపదలు, సామ్రాజ్యము పెరిగిన కొలది వీసలుడు గర్వపర్వత మారోహించి శకునివంటివాడగు తనమేనమామ సింహుని దురాలోచనములకు లొంగి తేజఃపాలుని ముద్రాధి కారము నాగడమంత్రియను వేరొక వైశ్యున కొసగెను. వస్తుపాలుని లాఘవముగ జూడసాగెను. మంత్రీశ్వరుడు తన గుమవు పౌషధాగారమును నేడంతస్తులుగనిర్మించియుండెను. అందొకనాడు పైయంతస్తు చిమ్ముచుండగా నా దుమ్ము

దిగువఁబోవుచున్న సింహుని మీఁదఁబడెను. ఆతడు చైత్య మందలి సాధువులను బాధింప మంత్రి ప్రేరితుఁడొక వీరుఁడు వచ్చి సింహుని కరములను ఛేదించిపోయెను. రాజు మేన మహా పక్షముతో వస్తుపాలుని గృహముమీఁదకు సైన్యము నంపించెను. వస్తుపాలుఁడు జంకక రాజుతోఁ బోరాడఁదలచి సకల సన్నాహములు కావించుచుండెను. మంత్రిభటులకు రాజసైన్యమునకు పోరు ఘోరమాయెను. రాజు సర్వసైన్య మును సన్నద్ధపరచి పంప వస్తుపాలుఁడు స్వయముగఁ దనవా రందరితోఁ గలసి విజయమో వీరమరణమో నిశ్చయించు కొనుటకు బోవుచుండఁ నీ విషయమెఱిగి కృతజ్ఞతాఖని సోమే శ్వరగురు వరుదెంచి "మంత్రీశ్వరా! స్వల్పకారణమున కేల సంగ్రామ సన్నాహములు? జ్యేష్ఠుకాన్వయులగు రాజులు, వీసలుఁడు నీపై కత్తికట్టిరి. సంధి కావించుకొ"మ్మన వస్తు పాలుఁడు కుపితుఁడై "నా కంఠమందు మాపిరున్నంతవరకు సాధు పరాభవము సైరింపను. నా ముందీ రాజులెంత? ఈ రాజ ప్రభువులను గడికండలుగ కోసెదను. సూర్యకిరణములు తమో గ్రస్తములగునా? నన్ను వీరు జయింపగలరా? సమర్థుఁడయ్యు సాధుపరాభవము మాన్పనివాఁడు జీవచ్ఛవముకదా" యని యనెను.

రాజగురువీ వాక్యములతో మంత్రి ప్రాణములకు దెగించినాఁడని తెలిసికొని రాజును చేరఁబోయి 'దేవా! వస్తు పాలుఁడు నీకు తండ్రివలె గౌరవనీయుఁడు. ఈ యాపదవలన నాతఁడు దుర్దేకించి లయభీకరుఁడై ప్రాణములకు తెగించి విక్ర

మించుచున్నాడు. ఈ యుద్ధమున నాతఁడెల్లరఁ జంపును. లేదా చచ్చును. తాతల తండ్రులనాటి సేవకుల మెండు రెండపరాధములు మీరుమన్నింపకున్న నెవ్వరు మన్నింతురు? సేవకులు మీయందు విరక్తులుకాకుందురా!''యని యనెను.

విశాలదేవుడు గురువుతో ''మీరు వస్తుపాలు నిచ్చ టకు గొనిరండు. నేనాతనిని ఘనముగ సన్మానింతు''ననెను. రాజగురువు వస్తుపాలుని కడకేగి యాతనిని రాజువద్దకుఁ గొనిరాగా వీసలదేవు డాతనిని ఘనముగ సన్మానించి తన మేనమామల నూరువురను వస్తుపాలుని పాదములమీఁదఁ బడనైచి క్షమింపగోరెను. మంత్రి రాజుతో ''రాజా! నేఁ సాధుహింసన మోర్వఁజాలనన రాజు తన రాజ్యమున సాధు హింసనము చేయరాదని శాసనము కావించి వస్తుపాలుని తృప్తిపఱచి సాగనంపెను. మంత్రులు చైత్యములందు వర్ధా పనోత్సవములు కావించి తీర్థప్రదేశములందు స్నాత్రోత్సవ ములు కావింపజేసి సంఘీయుల నారాధించిరి.

ఒకనాడు వీసలదేవుడు వస్తుపాలునితో 'నార్యా! నాగడమంత్రి లేకరి వ్రాసిన ప్రకారము రాజ ద్రవ్యము నొసగఁ'గోర నాతడు 'రాజా! మేము మీతండ్రియాజ్ఞ ననుస రించి పుణ్యకార్యములకు వ్యయించితి'మన సోమేశ్వరు డీవిధ ముగఁ బ్రస్తుతించెను. ''సమీరా! నీవు పరిమళమునకు నిన్నాశ్రయించిన రోలంబముల నండగొని సూర్య చంద్రుల నవమానించు చున్నావు''. ఈవాక్యములు విని రాజు మం త్రులను సన్మానించి సాగనంపెను.

వస్తుపాలుడొకనాడు కొంచెము జ్వరము తగులగ తేజఃపాలుని జైత్రసింహునిం బిలచి "వత్సలారా! శ్రీ నర చంద్ర మలధారి గురువులు విక్రమ శకము 1287 లోం గాల ధర్మ మొందుచు నేను 1298 లో మరణింతునని చెప్పిరి. ఇది నా యవసానకాలము. నేను శత్రుంజయ తీర్థమున కేగు వాడను. నాకా దైవము గురువు, వైద్యుడు కాగలడు. నా కొఱకు మీరు విచారింపకుడు. సంపద లార్జించితిని. సుఖించి తిని. పుత్రులను పౌత్రులను బొందితిని. నాకు మృత్యువు భయములే"దనగా తేజఃపాలుడు సకుటుంబముగ శత్రుంజయ యాత్రా సన్నాహములు కావింపసాగెను.

ఆ విషయమువిని విశాలదేవుడు వస్తుపాలు నింటికేగి కాన్క లొసగి "మంత్రీశ్వరా! ఈ సప్తాంగశోభితమగు రాజ్యము నీది. పూర్వమువలె నీమనోనుకూలముగ సంపదల వ్యయింపుము. ఈ యాత్ర కావించి మరలివచ్చి పూర్వ పదవి గైకొను''మని పల్కి యింటికేగెను.

వస్తుపాలుడు నాగడమంత్రి గృహమున కేగి సన్మాని తుడై "మంత్రీశ్వరా! నేను జినక్షేత్రయాత్ర కేగుచున్నాను. ఈ రాజ్యమును మనపూర్వులగు మంత్రులు స్థిరపరచిరి. నీవును మునిద్వేషము వహింపక సాధుపూజనము కావిం పుము. దుష్టులనుండి శిష్టుల రక్షింపు"మన నాగడుడు 'మం త్రీశ్వరా! నీవు సుఖముగ యాత్ర కావించిరమ్ము. నా సర్వ శక్తులతో సాధురక్షణ మాచరింతు'నని సాగనంప వస్తుపా లుడు స్వగృహమున కేతెంచెను.

పిదప మంత్రీశ్వరుడు యాత్రకు బయలుదేరి సుఖాసన మలంకరించెను. సంఘమువారు వెంబడించిరి. కాపాలిక గ్రామము చేరునప్పటికి మంత్రీశ్వరునకు బాధ యధికమాయెను. సర్వసూరుల సమక్షమున సప్తక్షేత్రమున సప్తలక్షల సువర్ణముల వ్యయింప శాసించి నిరశనుడై యిష్ట దైవము నారాధించుచు "సజ్జనులకు స్మరింపదగిన దేదియుఁ గావింపనైతిని. రాగులందు విరాగిణులగు స్త్రీ విషయిక మోహమువదలి విరాగులందు రాగిణియగు ముక్తికాంతను గామింతును. నాకు నుత్తమ గతులు కలుగుగాక!''యని పల్కుచు శరీరము త్యజించెను.

మంత్రి మరణమున కెల్లరు దుఃఖించిరి. సూరులు, సంఘీయులు, కవులు బహుధా విలపించిరన్న బంధుమిత్రుల విషయ మేమని చెప్పగలము? తేజఃపాలు డిట్లు విలపించెను. "తన యమృత కిరణములతో కలువల కాహ్లాదము, సముద్ర మునకు వృద్ధి, చకోరీనేత్రములకు ప్రీతి కావించిన త్రైలోక్య లక్ష్మీలలాట తిలకుడగు వస్తుపాలుని మృత్యురాహువు నిర్దా క్షిణ్యముగ గ్రసించెనే!"

జైత్రసింహు డుచ్చైస్స్వరమున నిట్లు విలపించెను. "ఖద్యోతములవంటివి, చంచలములునగు తారలుగల గగ నము చంద్రుడు లేకుండ నేమాత్రము ప్రకాశింపగలదు? పితృపాదులు లేని లోకమిట్లు శోకమయమై యున్నది".

కవులిట్లు విలపించిరి. "విధీ! సేవార్థులము, మంద బుద్ధులమగు మాతోనీవు విరోధించి మంత్రీశ్వరుని జిరంజీవిని

కావింపక మార్కండేయ, ధ్రువ, లోమశుల నేల చిరం జీవుల కావించితివి".

లోకులు, సంఘీయులు, సూరులిట్లనిరి." ధారుణీతలము నిరాధారమైనది. కల్పతరువు శుష్కించెను. చింతామణి భిన్నమాయెను. కామధేనువు వట్టిపోయెను. దైవత కామ కలశము భగ్నమాయెను. అయ్యయ్యో! ఏమి చేయుదము? ఎవరిని నిందింతము? ఏమని ధ్యానింతుము? ఎవరిని స్తుతింతుము? ఎవరికీ దిగులు మొగములు చూపింతము!"

పిదప తేజఃపాలాదులు కపర్దియక్షుని యాజ్ఞతో శత్రుంజయ పర్వతముపై వస్తుపాలుని శరీరమును చందనాగురు కర్పూరకస్తూరీ మలయాకరాది సుగంధ వస్తువులతో సంస్కరించి త్రైలోక్యసుందరమగు స్వర్గారోహమను చైత్యము నిర్మించిరి. అచ్చట పూజార్థము దేవాదాయముగ నర్కపాలిక గ్రామ మొసగిరి.

ఎల్లరు తిరిగివచ్చి విశాలదేవుని దర్శించిరి. విశాల దేవుడు వారినోదార్చి తేజఃపాలుని లక్ష్మీకోశాధికారిగ, జైత్రసింహుని సామంతరాజుగ నేర్పరచెను. తేజఃపాలుడు పదేండ్లు పదవి నిర్వహించి కుటుంబ సమేతముగ శంఖేశ్వర తీర్థమున కరుగుచు చంద్రోన్మాన పురమునఁ గీర్తిశేషుడాయెను. జైత్రసింహుడు గజాశ్వరచనాంకితముగ మందరోపమ జినమందిర మచ్చట నిర్మింపజేసి రాజాజ్ఞతో సరోవరము, ధర్మశాలలు రెండు సత్రము లేర్పరచెను.

శంఖేశ్వర తీర్థాధిష్ఠాన దేవత విదేహ దేశమున కేగి శ్రీ సీమంధర మహాదైవతము వలన "వస్తుపాలుడు విజయ పుష్కలావతిలో పుండరీకనగరమందు కురుచంద్రుడను పేర నుదయించి రాజై రాజ్యత్యాగ మొనరించి విజయవిమానాధిరోహక దైవతమై ముక్తి నొందగల"డని విని శ్రీ సంఘీయులకు తెలియజేసెను.

వస్తుపాలునిగూర్చి సంక్షేపముగ నిట్లు తెలియవచ్చుచున్నది. 1313 జైనాలయములు, 3,200 మిథ్యాదృశాలయములు, 750 బ్రహ్మశాలలు, 3,300 జీర్ణోద్ధరణములు, 12,500 జినబింబములు, 1,00,000 శివలింగములు, 701 తపోస్థానములు, 984 యతిశాలలు, 32 దుర్గములు, 84 కోనేర్లు, 700 సత్రములు, 400 పుష్కరిణులు, 64 పుణ్యములు, 100 శ్రుతదేవతా కోశములు, 63 యుద్ధయాత్రలు, 13 యాత్రలు, 100 ప్రపాశాలలు, 300 ఇటుకరాతి చలివేంద్రలు, 24,000 వాస్తుకుంభ వర్షాశనము లేర్పరచెను.

ఆ మంత్రిసోదరు లొనరించిన ధర్మకార్యములను శంభుశ్వాసములను, మార్కండేయుని నేత్రోన్మీలన మీలనాదులను తెలిసినవారు మాత్రమే లెక్కింపగలరు.

వస్తుపాల మహామాత్యో విశ్వవిశ్వోపకారకః
వైశ్యవంశ సముద్భూతో జీయేదాచంద్ర తారకమ్ ॥



